కాత్యాయనీగ్రంథమాల.
చతుర్థపుష్పము.

దివాకర్ల వేంకటావధాని,
తంగిరాల జగన్నాథశాస్త్రి,
సంపాదకులు.



శ్రీమత్పరదేవతాయైనమః

# కలగూరగంప.

ఇది
తిరుపతి వేంకటేశ్వరకవులచే
రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

కాకినాడ:
శారదాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1929.

చందాదారులకు రు. 0-12-0.    ఇతరులకు రు. 0-14-0.



శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు,
శతావధానులు.

# పీఠిక.

"కలగూరగంప"

అనునీపొత్తమునఁ బ్రచురించినవిషయము లెల్లఁ బరస్పరమును నానంతర్యాదిసంబంధములు లేక

"ఎవరికి వారే యమునాతీరే"

అనుచందమున మా శతావధానసారము నానారాజసందర్శనము లోనగుపొత్తములలోనియంశములవంటివై యున్నవి. ఇందు మేము కవిత్వాభ్యాసము చేయుదశలోని యప్రౌఢము లగుపద్యములు కూడఁ గొన్ని గలవు. మొట్టమొదట నట్టి పద్యములతోడనే యిది ప్రారంభింపఁ బడినది. కాని వరుసగా మాకవిత్వ మెట్లభివృద్ధి నందినదో అదే మార్గము ననుసరించి యిందాయాయీపద్యములు ప్రచురింపఁబడలేదు. శైలిని బట్టి విజ్ఞు లాయాయీరచనాకాలమును గుఱితింపవలసి యుండునే కాని క్రమమునుబట్టి కాదు. స్వల్పముగా వచనరూపమైన మాయుపన్యాసములనుగూడ నిందుఁ జేర్చితిమి. పద్యము లేమి వచనము లేమి యెన్నియో యింకను మిగిలియున్నవి. గ్రంథవిస్తరభీతిచే వదలితిమి. అంకెలనుబట్టి యుపక్రమోపసంహారములను గుఱుతించుకొనవలయునే కాని యింకనుఁ బెక్కింటికి శీర్షికలు లేవు. కొన్నిటికి సమాప్తిద్యోతకములగు గుఱుతులును లేవు. ముద్రణమున నెక్కుడుప్రమాదములు లేవుగాని యంతగాఁ జదువరులకు బాధింపని కొన్ని తెలుఁగువ్యాకరణసంధులు వదలినచోట్లుమాత్రము క్వాచిత్కముగాఁ గలవు. అవి ముఖ్యముగా 33 వ పుట మొదలుకొని 36 వ పుట వఱకే పొడకట్టెడిని. ఇంకఁ గొన్నిచోట్ల స్వల్పలోపములు గలవు. అందులో ముఖ్యమైనకొన్నిటిని నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 19 | మొల | మొల్ల |
| 8 | 8 | తనా | తన్మా |
| 10 | 15 | ధుంత్రుద | ధుక్ష్యతి |
| 27 | 22 | ననయువర్ణ | ననయువవర్ణ |
| 31 | 2 | స్వమే | ప్రియే |
| 45 | 18 | నునికు | నిసుకు |
| 58 | 8 | గవై | గరై |
| 59 | 15 | వాంది | రాంది |
| 69 | 20 | జంతా | జింతా |
| 80 | 3 | రాంబో | రంబా |
| 101 | 12 | గనలే | గనకే |
| 105 | 3 | మోంళి | మూంళి |
| 106 | 22 | గుహన | గుహన |

తక్కుంగల రేఫశకటరేఫాది వ్యత్యాసములను సవరించుకోఁగల భారమును జనకులపైఁ బెట్టుచు నింతటితో ముగించుచున్నాఁడను.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.

# ప్రోత్సాహకులు.

1 బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటసూర్యనారాయణగారు. బి. ఎ. బి, యి, లోకల్ ఫండు అసిస్టెంటు ఇంజనీయరు, నర్సాపురం.

2 „ తంగిరాల వేంకటసుబ్బయ్యగారు, పోలీసు సబ్ యిన స్పెక్టరు పాడ్వ.

3 „ గుళ్ళపల్లి సోమయాజులుగారు, గరల్సు స్కూల్ హెడ్ మాష్టరు భద్రాచలం.

4 „ నోరి సత్యనారాయణగారు, కాకినాడ.

మహారాజపోషకులు.

5 „ శ్రీ జగద్గురు చిదానంద నరసింహ భారతీస్వాముల వారు, అభినవ విరూపాక్ష పీఠాధిపతులు. కాకినాడ.

6 మ॥ రా। శ్రీ॥శ్రీ రాజా ఇనుగంటి వేంకట రాజగోపాలరామ సూర్య ప్రకాశ రాయనింగారు. ఉండూరు.

7 „ శ్రీ రాజా కాకర్లమూడి నారాయణ గజపతిరాజు బహద్దర్ గారు బి. ఎ. బి. యల్. రాజమండ్రి.

8 „ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు. ఆంధ్రపత్రికాధిపతి చెన్నపురి.

రాజపోషకులు.

9 బ్రహ్మశ్రీ దేవరకొండ రామనాథంగారు యినాందారు, మండపాక.

10 „ యఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారు, బి. ఎ. బి. యల్. వకీలు నర్సాపురం.

11 మ॥ రా॥ శ్రీ॥ బి. యస్. నారాయణగారు. కాకినాడ.
12 ,, సి. చినవెంకట్రామన్న సోదరులు కాకినాడ.
13 ,, జి. శ్రీనివాసరావుగారు, తహశ్శిల్ దారు చోడవరం.
14 ,, పి. హనుమంతరావుగారు సబ్ ఓవరుసీయరు పి. డబ్లియు. డి. ఉండి.
15 ,, పి. వెంకటేశ్వరరావునాయుడుగారు, కంట్రాక్టరు, పాలకొల్లు.

## పోషకులు.

16 బ్రహ్మశ్రీ సి. వై. సోమయాజులుగారు. బి. ఎ. బి. యల్. వకీలు నర్సాపురం.
17 ,, మురుకుట్ల సుబ్బారాయుడుగారు. బి. ఎ. ప్లీడరు భీమవరం.
18 ,, మేడూరి లక్ష్మీపతిగారు. ఈనాందారు మండపాక.
19 ,, మేడూరి సూర్యవర్ధనగారు ,, ,,
20 మ॥ రా॥ శ్రీ॥ తాడిమేటి పేర్రాజుగారు ,, ,,
21 ,, దండు విజయరామరాజుగారు. ,, నముడూరు.

## అభిమానులు.

22 బ్రహ్మశ్రీ దేవరకొండ పాపయ్య శాస్త్రిగారు ,, మండపాక.
23 ,, జోస్యుల రామచంద్రరావుగారు. ,, ,,
24 ,, జయంతి దీక్షితులుగారు. ,, కాకినాడ.
25 ,, మురవన లక్ష్మీనరసప్పగారు. డిప్యూటీ కలక్టరు భద్రాచలం.
26 శ్రీమాన్ సాతులూరి నరసింహాచార్యులుగారు. మండపాక.
27 మ॥ రా॥ శ్రీ గుత్తా వెంకయ్యచౌదరిగారు. ఏలూరు.





శ్రీమత్పరదేవతాయైనమః.



# కలగూరగంప.

## భక్తి.

(రంగేశ్వరుఁడు)

శా॥ శ్రీరామామణి వక్షమందుఁ దనరన్ జెన్నొందుతన్నున్ జనం
"బారాని చంచలతం దొలంగ నిపుడుం గర్జిన్ ధరింపంగఁ బో"
యీ రాజద్ఘన మంచు వర్ణనలు తా రింపారఁగాఁ జేయ నా
శ్రీరంగమ్మున నుండురంగఁడు యశశ్శ్రీ లిచ్చు మా కెప్పుడున్. 1.

(కృష్ణుఁడు)

శా॥ శ్రీమన్మంగళదేవతాస్తనమిళత్స్నిగ్ధస్ఫురచ్ఛ్రీమదో
ద్దామాంకాంకితవక్షముం గని మదిన్ దా నీర్ష్యతో రాధికా
భామారత్నము పల్కుచుండినను "గోపం బేల న న్నేలు" మం
చామెన్ వేడుక నేఁడు కృష్ణుఁ డిడు మా కత్యంతసౌభాగ్యముల్. 2.

(వేంకటేశ్వరుఁడు)

ఉ॥ శ్రీమదఖండవైభవముచేఁ జెలువారెడి వేంకటాద్రిపై
సామజయాన శ్రీరమణి చక్కఁగఁ బాదము లొత్త నారదుం
"డోమహనీయ సేవితగుణోజ్జ్వల" యంచు భజింపుచుండు ని
న్నే మది నమ్మినాఁడ దయ నేలుమి శ్రీకర వేంకటేశ్వరా. 3.

చ॥ శరదరవిందలోచన! లసన్మణియుక్తకిరీట! కంకణ
స్ఫురదురుబాహుశోభిత! విశుద్ధచరిత్ర! రమాంగనామనో

హరుని హరపూజితాంఘ్రియుగుని యాశ్రితభక్తమనోనివాసుని కి
న్నరగరుడోరగాదినుతనామవిరాజితుని వేంకటేశ్వరా. 4.

(జగదీశ్వరి)

సీ॥ సారహీనపదార్థసంచయమ్మందు నిస్సారమైనయది సంసారమకద?
అట్టిసంసారమం దజగుపత్రిమిత్రాదులకునైనఁ దగిలికొల్పుగుగద?
తగులుకొన్నమీఁద ధనములేకున్నచో గడెయైనఁ గాలమ్ము గడవదుకద?
కాలయాపనకుఁ బాఘనుఁడయ్యు నీచునైనను నాశ్రయించుట న్యాయమకద?
తే॥ గీ॥ అట్టిపని కవిచంద్రుల కర్హ మగునె, నీ వెఱుంగనిధర్మ మిందేది గలదె
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాఁప, యని జిలుకవమ్మ రో జగదీశ్వరమ్మ.

సీ॥ ఆశ్రయించినవారి నవులఁ బొమ్మని చెప్పుట న్యాయమా మది నరయవొక్కొ
అభిమానము గలవిద్యావంతులకు దరిద్రత్వ మిక్కట్టని తలఁప వొక్కొ
ధనహీనులకు ధనంబు నొసంగుట మహోపకారంబనుచు మదిఁ గాంచవొక్కొ
ఎవరి కిచ్చినను గవీంద్రులకీకున్న కలుగదు యశమని తెలియవొక్కొ
గీ॥ సకలము నెఱింగి నాకు నైశ్వర్య మొసఁగ, జాగు చేసెద విది యేటిచంద మమ్మ
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాఁప, యని జిలుకవమ్మ రో జగదీశ్వరమ్మ 6.

సీ॥ దారిద్ర్యమునఁ గ్లేశత్వదశ చెందెడివాఁడు తనివిలెనట్టిసిగ్గునను బ్రమగ్గు
సిగ్గు చెందినమీఁదఁ జెడిపోవుఁ దేజంబు తేజంబు చెడిన దుస్స్థితి ఘటించు
మీఁద నిర్వేద మాపాదిల్లు నిర్వేద మనుసరించిన శోక మినుమడించు
నజ్ఞాన బుద్ధికి హాని వాటిల్లు నిర్బుద్ధియౌ పురుషుఁడు పొలియుఁ బిదప
గీ॥ నిట్టిదుర్గతి కవులపై నెట్లు వెట్టి, తమ్మ నీమన మెటు లొప్పెనమ్మ రమ్మ
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాఁప, యని జిలుకవమ్మ రో జగదీశ్వరమ్మ 7.

సీ॥ గణియించవే మహాఖర్వగర్వాంధతమసమలీమసులైన మనుజపతుల
నుతియింతువే జగన్నుత్యవిద్యాప్రభావను నెఱుంగనిమహీవలయపతుల
దర్శింతువే కవిత్వప్రశంసావాసనావాసితులు గాని నరపతులను
మన్నింతువే సదా మానినీమధుపానముఖదుర్వ్యసనులైన భూమిపతుల
తే॥ గీ॥ నెప్పుడేనియుఁ దప్పదీయవ్వటంచు, గొప్ప యగునీకటాక్షమ్ము గుప్పితేని
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాఁప, యని జిలుకవమ్మ రో జగదీశ్వరమ్మ 8.

సీ॥ త్వత్కటాక్షంబనుత్తమమహేంద్రదత్వదివ్యపదసంపాదనాపాదకంబు
త్వత్కటాక్షంబ దభ్రవిశ్వైశ్వర్యధనదతాపాదనాధాయకంబు
త్వత్కటాక్షంబు భాస్వత్ప్రభావప్రకాశమహాధికృతిముఖ్యసాధనంబు
త్వత్కటాక్షంబు విద్వత్త్వాకవిత్వాధికత్వాదిసంధాన కారణంబు
తే॥ గీ॥ ఇట్టిదని నీకటాక్షమ్ము నెఱిఁగి దీని, విడిచి యన్యుల నెట్లు సేవింతుమమ్మ
కామధేనుస్మరణ నీదుకరుణ మాప, యని జిలుకవమ్మ యోజగదీశ్వరమ్మ 9.

సీ॥ అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడైనఁ గవులతో సామ్యమ్ము గాంచఁగలఁడె
నుజ్జగమ్ముల నేలు పురుహూతుఁడైనను గవులతో సామ్యమ్ము గాంచఁగలఁడె
నవనిధుల్ గల్గుమానవహయుండైనను గవులతో సామ్యమ్ము గాంచఁగలఁడె
సార్వభౌమ్యము గల్గుజనపాలుఁడైనను గవులతో సామ్యమ్ము గాంచఁగలఁడె
తే॥ గీ॥ దైన్యములకెల్ల దైన్యమైనట్టిదన్య, దైన్య మొక్కటి వారికి శూన్యమేని
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప,యని జిలుకవమ్మ యోజగదీశ్వరమ్మ. 10.

సీ॥ ఆర్పి వచ్చినఁ గాని యన్యులకీక తా మనుభవింపనిలుబ్ధజనుల విడిచి
వ్యాజ్యముల్ వేఁటలు నన్యమై పచరించుపరమపాత్రులను దుష్ప్రభుల విడిచి
రసమన నెట్టిదో యెనుమంతయైనను గలనైన లేని మొద్దులను విడిచి
హాని వాటించు కార్యము లొనర్పఁగ యత్నము లొనర్చునట్టిమూఢులను విడిచి
తే॥ గీ॥ అహహ దారిద్ర్యభారమ్ము ననఘులైన, కవుల నెత్తిని బెట్టు టొప్పునటమ్మ
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప,యని జిలుకవమ్మ యోజగదీశ్వరమ్మ. 11.

సీ॥ బహుజన్మకృతతపఃపరిపాకమున మించునట్టియుద్దండభాగ్యాతిశయము
భావికాలప్రాప్యఫలసూచకామేయమామకీనాదృష్టమహితకలము
అనిమిత్తజాయమానానూనకరుణాకటాక్షవీక్షణ వైభవాగమము
కామరూపకళాప్రకాశసౌభాగ్యసువ్యక్తీకరణచణప్రాభవంబొ
తే॥ గీ॥ కిలను బ్రత్యక్షమైతి వేకారణంబొ, తెలియదిది యూరకేపోదు దేవదేవి
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప,యని జిలుకవమ్మ యోజగదీశ్వరమ్మ 12.

## జ్ఞానము.

(ఆత్మబోధ (సంస్కృతమునకుఁదెనుఁగు)

క॥ తపములచేఁ బాపమ్ములు, దీపి శాంతిని బొంది రక్తిఁ డించి సదా ము
క్తిపదము గోరెడిహారల, కుపకృతిగా నాత్మబోధ మొనరింతు మొగిన్. 13.

గీ॥ మోక్షసాధనములలోన ముఖ్యసాధ, నంబు బోధయ ముక్తిపదంబు బోధ
లేక యుండినఁ గలుగదు పాకమునకు, ననలమేకద ముఖ్యసాధనము జగతి.

కం॥ అవిరోధి గానఁ గర్మం, బవిద్య నడపంగఁ జాల దట్టియవిద్యన్
దవిలి తమఃబును దేజం,బువిధమ్మున జ్ఞాన మెలమిఁ బోఁగొట్టుఁ జుమీ. 15.

కం॥ పరమాత్ముం డజ్ఞాన, స్ఫురణమ్మున భిన్నరీతిఁ జూపట్టెడిఁ ద
న్నిరసనము గలుగ నేకుఁడు, వరణ మెడలు సూర్యుపగిది స్వయము వెలుంగున్.

తే॥ గీ॥ జ్ఞానమజ్ఞానకలుషతాకలితు జీవు, జ్ఞానవశమున నిర్మలుఁగా నొనర్చి
తానును నశించుఁ గలుషమైతనరు జలము, చక్కఁజేసెడి కతకరజంబువోలె.

తే॥ గీ॥ నిద్రవేళను స్వప్నమ్ము నిజముగాఁగఁ, దోఁచుభంగిని రాగాదిదుష్టమైన
సంసృతియుఁ దోఁచు నజ్ఞానసత్త్వయందు, సత్యమై; యదిపోవ నసత్యమగును. 18.

గీ॥ అవ్యయుండును సర్వలోకాశ్రయుండు, నైన యీశ్వరుఁడెందాఁకఁ గానఁబడఁడో
జగము నందాఁక సత్యమై నెగడు శుక్తి, యందు రజతంబు దోఁచెడునట్టిభంగి. 19.

కం॥ వ్యాపకుఁడును సదసచ్చి, ద్రూపకుఁడును సర్వసంగతుఁడు నగు హరియం
దే పారు సర్వజంతు, వ్యాపృతి కటకాదికము సువర్ణమునఁబలెన్. 20.

కం॥ ఆకాశము విధమునను హృ, షీకేశుండైన విభుఁ డశేషోపాధి
ప్రాకారుండై భిన్నుం, డై కనఁబడు నొక్కఁడగును పాధినశింపన్. 21.

తే॥ గీ॥ జాతినామాశ్రమాదు లీశ్వరునియందు, పాధిభేదమ్ము కతన నాపాదితమ్ము
లకలుషమ్ము నమధురమ్ము నౌ జలమ్ము, నందు రసవర్ణభేదముల్ వొందునట్లు.

కం॥ పంచీకృతోచ్చభూతో, దంచితమై కర్మరచితమై తగుదేహం
బెంచఁగ సుఖదుఃఖమ్ములు, గాంచెడి భోగాలయమ్ముగాఁ జెప్పఁబడున్, 23.

కం॥ పంచప్రాణమనోబు, ద్ధ్యంచద్దశకరణయుక్తమగు సూక్ష్మాంగం
బెంచ నపంచీకృతభూ, తాంచిత మిది భోగమునకు నగు సాధనమై. 24.

గీ॥ ఆరయ నవాచ్యమైన యనాద్యవిద్య, కారణోపాధియని చెప్పఁగాఁదగియెడి
నీయుపాధిత్రయమ్మున కెవ్వఁడన్యుఁ, డతఁడపోని యాత్మయని చెప్పనర్హుఁ డెందు.

తే॥ గీ॥ పంచకోశాదిసంబంధభావమునను, వస్తుతశ్శుద్ధమౌ పరవస్తు వెలమి
నలరుఁదత్తన్మయమువలె ననితవర్ణ, వస్త్రయోగమ్ము కతన సుస్ఫటికమట్లు. 26.

క॥ సకలగతుఁ డయ్యుఁ బరమా, త్మ కనంబడఁ డెల్లచోట్ల మఱిఁ గనఁబట్టున్
బ్రకటముగ బుద్ధియందే, ముకురాదులయందు బింబములవలె నెపుడున్. 27

ఆ॥వె॥ కాయచిత్తబుద్ధికరణమ్ములకు నన్యుఁ, డైతదీయకృత్యమధిపుఁ బోలె
నెవ్వఁ డరయుచుండు నెల్లప్పుడతఁడ పో౯, యాత్మయనుచుఁ జెప్ప నగ్వాఁ డెందు

క॥ కరణమ్ములు వ్యాపింపన్, బరమాత్మయు మూఢులకును వ్యాపారివలెన్
బరిదృశ్యుం డగు మేఘా, త్కరము గదలఁ గదలునట్లు కనుపడు శశినా. 29

తే॥గీ॥ ఆత్మచైతన్యమును దగ నాశ్రయించి, కాయకరణమనోధీలు స్వీయకృతుల
వర్తిలుచునుండుఁ బద్మినీ ప్రభుని కాంతి, ననుసరించి మెలంగెడిజనులపోలిక—

క॥ కాయేంద్రియగుణ కర్మము, లాయమలుండైన సచ్చిదాత్మునియందున్
ద్రోయుదు రవివేకమ్మున, నీయాకసమందు నైల్య మెంచెడిరీతిన్. 31

గీ॥ మానసోపాధిసంబంధమైన కర్తృ, తాదికం బాత్మయందుఁ బ్రమాదమునన
గల్పితంబయ్యె నుదకసంగత సుధాంశు, నందుఁ దద్గతచలనాదు లమరురీతి. 32

ఆ॥వె॥ బుద్ధిసత్త యుండ పోని రాగమును నిచ్ఛ, యును సుఖాదికమ్ము లొనరుచుండు
నది యడఁగు సుషుప్తియందు నవియు లేవు, కాన నాత్మగములు కావు సూవె

క॥ రవికిఁ బ్రకాశం బగ్నికి, రవరవ జలమునకు శీతలతయు స్వభావం
బవు విధమునఁ బరమాత్మకు, నవినాభావమున సచ్చిదాదులు వొలయున్. 34

ఆ॥వె॥ ఆత్మసచ్చిదంశ మరయంగ బుద్ధివృ, త్తియును వివేకవృత్తితోడఁ
గలిపెనేని గలుగుఁ గా యహంకారమ్ము, కేవలాత్మ శుద్ధభావుఁ డెందు. 35

క॥ పరమాత్మకు విక్రియ లే, దరయఁగ బుద్ధికిని బోధ మన సున్న యటం
చెఱిఁగియు జ్ఞాతృద్రష్టృ, త్వరీతులను జీవుఁ డకట! తా మోహియగున్. 36

క॥ అరయుచుఁ జీవునిఁ గాఁ దన, న్నరజ్జుసర్పత్వరీతి నూనముగాఁ దాఁ,
బొరయు భయమ్మును నేనే, పరమాత్మ నటన్న మాత్ర భయము దొలఁగున్.

గీ॥ ఆత్మవలన వెలుంగు బుద్ధ్యాదికమ్ము, లాత్మ బుద్ధ్యాదికమ్ముల కప్రకాశ్యుఁ
డెలమిదీపము వస్తువులు వెలుఁగఁ జేయుఁ, గాని యవి దీపతేజంబు గనుపఱచునె.

క॥ తనుఁ దాఁ దెలియుట కన్యం, బనపేక్ష్యము బోధరూపుఁ డగు నాత్మునకుఁ; ద
న్నును వెలిగింపఁగ దీపం, బునకొండు ప్రదీప మేల పొసఁగింపవలెన్. 39

తే॥గీ॥ "నేతినేతి" వాక్యమ్ములచేత సకల, మైనయట్టియుపాధుల నవులఁ ద్రోచి
జీవపరమాత్మలకు సౌఖ్యసిద్ధినపుడు, వడయఁగా వలె నమ్మహావాక్యకలన.

(సశేషము.)

## శ్రీమదాదిశంకరులు.

క॥ శంకరు సతతారాధిత, శంకరు వేదాంతశాస్త్రసాధితసంవి
త్పంకజభాస్కరు లోకా, లంకారు నుతింతు మదిఁ గలంక పొడలఁగన్.

గీ॥ ఎంతకాలమ్ము బ్రదికిన నేమి ఫలము, జగతి కుపకారమొక్కింత సలుపఁడేని
దానికై బాల్యమాదిగఁ దనదు జీవి, తమును వెచ్చించు శంకరుఁ దలఁపవలదె. 42

సీ॥ మండనమిశ్రుతో మాటాడ శక్యమే? భగవత్కళాశక్తి ప్రబలదేని
భట్టభాస్కరుతోడ భాషింపశక్యమే? యెంతటి ప్రతిభయు నెనఁగదేని
ఉపనిషద్భాష్యము లొనరింపశక్యమే? సర్వజ్ఞతాభూమి చనదయేని
అన్యకాయప్రవేశాలంబనము తెలికనౌ? యోగపరిణతి గలుగదేని

తే॥గీ॥ బ్రతికినదిమూడ స్వల్పమహ్నావనుండు, సల్పు కార్యమ్ములకుఁ జట్టుగల్ప మేని
అతఁడు లేఁడన నేల? యేమయ్యె నిప్ప, టికి నిమ్మృతజీవుఁ డెల్లవారికి హితుండు.

చ॥ ఒరులకెఱుంగరాని గతి నొండొకరాని కళేబరమ్మునన్
జొరఁబడి కామశాస్త్రపరిశోధనమున్ బొనరించి దాన వా
క్తరుణిజయమ్ము గైకొనుకతన్ బరిశీలన చేసి చూడ సం
సరణ మనాది, జ్ఞానులను సైతము వీడదటంచుఁ దెల్పెడిన్. 44

చ॥ ఒకఁడన నేల? శంకరుమహౌన్నత్యవర్గన సొంది చూచినన్
సకలకళానివాస మగు చందురుబింబమునందుఁ బోలెఁ ద
త్కరకయమృతంబు చిప్పిలుటెకన్పడు నయ్యనఘాత్ముఁ గన్న త
ల్లికి నుతిఁ దండ్రికిన్ జగతి లేరు మహోన్నతు సాటి చెప్పఁగన్. 45

## శ్రీరామకృష్ణపరమహంస.

మ॥ కరుణాపూరతి నూఱకే బలిగన కాళీమహాదేవికై
నరులం జంపెడివంగదేశపు ద్విజన్మస్తోమమం దెట్టులో
పరమార్థజ్ఞుఁడు రామకృష్ణుఁడు పరబ్రహ్మత్వరాంశమ్మునన్
ధరణింబుట్టెఁ దదీయచిత్రచరితల్ ధ్యానింపఁగాఁ జెల్లవే. 46

సీ॥ చదువ నేలేదఁట? శాస్త్రాదులనుకింత గురువయ్యె నేలాటిగురువులకును
అనుభవింపకయె యేలాచెందెనొ? విరక్తి యేవిరాగులు నేర రీసమాధి
తనకన్న నితరమింతయు లేదని యెఱింగియును గాళికార్చనమును బొనర్చె
నీయుగమ్మునను లేనేలేని మహిమ లెన్నెన్నియో చూపె సరిహుఁడయ్యె.
తే॥గీ॥ ననుచుఁ జెప్పెదరయ్య నఘాత్ము చరిత, విధినిషేధము లెఱుఁగక వేదవేత్త
లైనవిద్వాంసులకును మాన్యతవహించి తనరు శ్రీరామకృష్ణున కెనయెవరులు

శా॥ ఏయోగీంద్రుని శిష్యుఁ డొక్కరుఁడు దాద్వీపాంతరం బేగి వి
ద్యాయుక్తిన్ దగవారిలోఁ బలుచి "ధ్యేయంబిద్దియే" యంచు న
జ్ఞేయంబైచను తత్త్వముం దెలిపి యెన్నో దర్శ తాల్ మాపె న
శ్రీయుక్తుం డలరామకృష్ణుసరి యేరీ? జ్ఞానులెందేనియున్. 48

ఉ॥ వేదము పిచ్చి, శాస్త్రమన వెఱ్ఱి, యధర్మము దెద్ది, యంచు వా
గ్వాదము సేయునట్టి కలికాలమునందును నెవ్వఁడో యొకం
డాదిమకాలమందు బలె నార్యుఁడు పుట్టఁగవచ్చు నంట దు
ర్వాదముగామి కియ్యనఘువర్తనమే యొకసాక్షి నాఁదగున్. 49

తే॥గీ॥ వేదములు కష్టపడి వల్లెవేయనేల, శాస్త్రములలోఁ బరిశ్రమ సల్పనేల
రామకృష్ణ పరమహంసరాజు నుడువు, నట్టిబోధల నీయర్థ మట్టిపడెడి. 50

శ్రీవివేకానందస్వామి.

సీ॥ పుట్టెనెవ్వఁడు హిందువులలోనఁ గాయస్థజాతిలో వంగదేశమ్మునందు
చదివె నెవ్వం డొక్కసంస్కృతంబె కాక యింగ్లీషు మొదలెన్నియేనిభాష
లరసె నెవ్వాఁ డొక్క యద్వైతమే కాక భూమిలోఁగల మతమ్ములవియెల్ల
తిరిగె నెవ్వాఁ డాత్మదేశ మొక్కటె కాక యఖిలమ్ములగు విషయమ్ములెల్ల
తే॥గీ॥ నిహమునంగల్గు తుచ్ఛమౌ నిచ్ఛవిడిచి, బాల్యమాదిగఁ బరముకై పాటుపడుట
తక్క నెవ్వాఁ డెఱుంగఁడతఁ డమునుండె, అతఁడు వివేకయోగి దివ్యపదభోగి.

చ॥ ఎవనికి శక్యమాయె? మతములెల్ల విచారణ సేయునట్టి హూ
ణవరులదేశమందున ఘనంబగునట్టి సభాస్థలమ్మునం
"దవనిని గల్గు మీమతమ్ములన్నియు లేఁత" లటంచు ఖండనం
బు బొనరుపక, స్వకీయమతము న్నిలుపంగ, వివేకుఁ డక్కనన్. 52

నవయదు రూపుమాయదు తనంతన వృద్ధిని గాంచ నేర్పు ని
క్కువ మిది దీనినే సతము గోరుఁడు బాగుపడుండు మీరొగిన్. 61

శ్రీకృష్ణకథాసంగ్రహచంపకమాలిక.

చ॥ జననము నందె బంధనపుసద్మమునందున; వేఱుచోటికిన్
జనె నటఁ గంసువంపున వెసన్ బురుటింటికి వచ్చినట్టిపూ
తనచనుఁబాలు గ్రోలె నది దానవవక్రతాఘుమకల్మిఁ జచ్చె మీఁ
దను శకటాకృతున్ గెడపె దానవు; నావయి గాలిరక్కసుం
దునిమెను మీఁదఁ దల్లికి వినోదముగా సకలప్రపంచముల్
గనఁ బడఁజేసె ఱోలఁ దనుఁ గట్టినయప్పుడు రెండుమద్దిచె
ట్లను బడఁగొట్టె వత్సుఁడను టక్కరిరక్కసు నుక్కఁ జెక్క ద
ర్మనను బకున్ హరించెఁ బయిఁ మట్టెను ధేనుకు గార్దభాకృతిన్
ఘనవిషపూరితున్ బిదపఁ గాళియు నొంగ్య నొనర్చె దావవ
హ్నిని నొగిఁ గ్రోలెఁ బరత్వము నెత్తె వధించెను శంఖచూడనా
ముని నొకగుహ్యకున్ జదియ మోఁదె వృషాసుర వ్యోమకేశులన్
దునిమెను గంసుఁ జంపెను విధుఁతుదవక్త్రను రుక్మిణిన్ వరిం
చెను మఱిఁ గొందఱన్ సతులఁ జేకొనె భూసుతు రూపుమాపె న
ద్దనుజు చెఱన్ వదల్చిన వదంపడి తన్ను వరించినట్టి కా
మినులఁ బదాఱువేలఁ గొనె కొకొని బాణుని గర్వ మూడ్చె నిం
కను మఱికొందఱం దునిమెఁ గష్టుల దుష్టుల భ్రష్టులన్; మహా
ముని యగునారదుం డడుగ మోదముగాఁ దనలీలఁ గామినీ
జనగృహపంక్తి నొక్కమొగిఁ జక్కఁగ జూపి నిరుత్తరున్ బొన
ర్చె నితఁడె నందనందనుఁడు శ్రీహరి యీతఁడె యీతఁడే జగ
జ్జనము రక్షయున్ లయము సల్పు పరాత్పరుఁ డీతఁడే
ఘను లగుపాండవేయుల క కారణబంధువు వీనిచర్యలన్
గనుఁగొని చెప్ప శక్యమనఁగా దెటువంటిమునీంద్రపాళి; కీ
యనఘుఁడు నేఁడు పుట్టె నిది యందఱకప్పటినుండి పూజ్యతన్
గనె దిన, మిమ్మహామహునికై మన మియ్యెడ నేఁడు గూడి యీ
తనిచరితంబు పాడితిమి ధన్యతఁ గంటిమి తప్ప కిక్కత

మున్నన మనకుఁ బ్రమోదములు పొందిరివో యొడి సభ్యులార! వం
దనము లొనర్చెడి యొలమి నందునిపట్టికి గొల్లపుట్టికిన్. 62



(భావ.)

# ఆంధ్రమహాకవిప్రశంస.

ఉ॥ శ్రీకరమాంధ్రభారతము చేయఁగఁ జేసె నెవండు నన్నయా
ఖ్యాకమహాకవిప్రవరు నంజలిబంధముతోడ వేఁడి; సు
శ్లోకుఁ డతం డుదారగుణశోభితుఁ డాంధ్రకవిత్వదివ్యధా
రాకుతుకీకృతాంతరుఁడు రాజనరేంద్రుఁడు వొల్చు నేఁటికిన్. 63

ఉ॥ ఏగతినో కవిత్వము సనేకులు సెప్పెదువార లుండ స
ర్వాగమవేది నన్నయమహాకవియే యని నిశ్చయించి యు
ద్యోగిని జేసె "భారతమహోదధి నీఁదు" మటంచు నెవ్వఁ డా
హా! గణుతింపఁ జెల్లదె మహామహు రాజమహేంద్రు నాతనిన్. 64

ఉ॥ వచ్చి శరీరముం విడిచి చన్ననృపుల్ గల రెందఱేని వి
ద్వచ్చయమాన్యమున్ సుకవివంద్యము నై తగు కీర్తికాయ మీ
సచ్చరితుం ధరించె నిది శాశ్వత; మీనృపు సన్నుతించి స
ర్వోచ్చపదంబుఁ గైకొనుట యొప్పదె యిప్పటి యాంధ్రజాతికిన్ 65

తే॥గీ॥ రాజరాజనరేంద్రుండు పూజనీయుఁ, డైననన్నయసుకవియు నాంధ్రభాష
భారతంబనునిధిలోన భద్రపఱచి, యుంచుటను గాదె మనకు సుయోగమబ్బె

ఉ॥ నన్నయగారి త్రోవఁ గొని నవ్యగుణంబులు కొన్ని చేర్చి తి
క్కన్న మహాకవిప్రవరుఁ డాంధ్రకవిత్వము వృద్ధి చేసె నె
ఱ్ఱన్నయు వీరి త్రోవఁ గొని యగ్గల మింకొక కొంత యిచ్చె, స
ర్వోన్నతి తెచ్చె సోముఁడు మహోదధి నాఁ జను నాంధ్రభాషకున్. 76

ఉ॥ పెక్కుమహాకవుల్ పిదపఁ బెక్కు పురాణము లాంధ్రభాషలోఁ
దిక్కనగారి త్రోవను సుధీహిత మొప్పఁగఁ జేసి రంతతో

నైకఁడ (దెల్గుసేయ మది కెక్కఁ బురాణము లేక పోయె న
మ్యకఁ కృతికర్త నైషధమహాకవిమౌళి జనించె నంతటన్. 68

ఉ॥ ఇతనికవిత్వపుం గరిమ కెన్నఁగ నన్నయ యంతవానిఁ గాఁ
గృతిమణు లెల్లఁ జెప్పడు రహీనమహాకవితానురాగ గా
వితతమహీతలుం డితఁడు విశ్వజనీనము నైషధంబు గా
వ్యతతిశిరోవిభూషణము నాంధ్రము చేసి యొసంగె భూమికిన్. 69

ఉ॥ ఈతని కాలమందుఁ గల రెందఱొ సత్కవు లందఱున్ మహా
ఖ్యాతిపరుల్ కృతిప్రవరకల్పకు లాధ్యుత రాగ్రహారవి
ద్యోతను లుద్భటాశుకవితోద్ధతు లందఱియందు నీతఁడే
నేతగ ద్యోతలెన్ దను మ[illegible] కొనెక్కఁగన్. 70

శా॥ శ్రీనాథుండు యశశ్శరీరపు[illegible]న కా
పై నాంధ్రావనిభాగ్యపుంగ[illegible]చెన్ రసా
నూనాశ్యాశుకవిత్వ తత్త్వ[illegible]ండు భా
షానందుం డల పెద్దనార్యుఁడు [illegible]ధాన[illegible]సంధాతయై. 71

ఉ॥ "ఆశుకవిత్వతత్త్వ మిది యా నిది కా"దని కృష్ణరాడ్యశో
రాశిసభాస్థలమ్మున [illegible]రంధరులౌ కవులున్ ధరాంగనా
ధీశుఁడు కృష్ణరాట్కవియు మెచ్చఁగ మెచ్చఁగ బెండెరంబు సూ
రీశుఁడు పెద్దనార్యుఁడు గ్రహించె రచించె స్వతంత్రకావ్యమున్. 72

తే॥గీ॥ ఆంధ్రకవితాపిత మహానసునగించి, వసుచరిత్రంబు రచియించె బట్టుసుకవి
ధారల[illegible]కేవమున్నను దానికన్న, మిన్నయనిదీనిఁ బలువురు మెచ్చుకొందు.

తే॥గీ॥ నారికేళపాకమ్మున సూరివరుల, నలరఁ జేయువాముక్తమాల్యద రచించి
నట్టి శ్రీకృష్ణరాయల యనుఁగు సూన, యల్లసానికవీంద్రుఁ డగుచు శోభిల్లె బట్టు.

క॥ బట్టయ్య యితఁడు నన్నయ, భట్టారకముఖ్యసుకవివరులకు దీటై
దిట్టయయి శ్లేషకవితకుఁ, బెట్టిన పేరై యశస్సు పెంచె జగమునన్. 75

ఉ॥ పిమ్మట సువ్వళించె నలతింగళి సూరన యాతఁ డెంతయున్
గమ్మనివల్కులన్ గవితకల్పన సేయుసుధీవతంసుఁ డిం

కమ్మకానీయు లెందఱో జగమ్మున నాఁడుగలారు వారిలో
నిమ్మహితుండె పేరువడె నీతనిధార మహాద్భుతంబుగన్. 76

ఉ॥ బమ్మెర పోతరా జనెడి భాగవతాంధ్రకవీంద్రునిన్ జగ
త్సమ్మతు రామభక్తు నరవ ప్రథితాంధ్రకవిత్వరాశి నీ
పిమ్మటఁ జెప్పఁగాఁదగదు పెద్దకవీంద్రుల కెల్లఁ బెద్దగా
నిమ్మహితుల్ వచింపవలె నీతనిశక్తి యనన్యసాధ్యమా. 77

చ॥ ఘనమతు లెందఱో గలరు గాని యదేమొ తెనాలిరామకృ
ష్ణుని కవితామహత్త్వ మతిసత్య మటంచుఁ గవీంద్రు లందు రా
యనఘుని భాతిఁ జూచిన నహా యనకుండురె యేరు గాని యె
వ్వని నని యెన్న నేమతు మహారు లనేకకవీంద్రు లుండఁగన్. 78

చ॥ విజయవిలాసకర్త సురివేకి మహాకవి యన్యజాతికిన్
ద్విజానకు నుద్ధరించిన సుధీతిలకుం డితనిన్ మహాకవి
ప్రజ మనమానుఁడ్రిదంచును ప్రబంధము చూచి నుతింతు రింత ది
గ్విజయము గొన్న కావ్యము భువిన్ రసధోరణిఁ గాన రాదుగా. 79

గీ॥ స్త్రీలలోఁ గూడఁ గొందఱు శ్లేషలాది, గాఁగలుగు ప్రౌఢపద్యతుల్ గలయఁగూర్చి
చెప్పి రొకకొన్ని కావ్యముల్ మెచ్చ గనిరి, నాఁటి సుకవులచే ధరానాథసభల.

మ॥ తతవిద్యారసికప్రచారుఁ డగు శ్రీతంజాపురీవల్లభా
చ్యుతశ్రీమద్రఘునాథభూపుదనుకన్ శోభిల్లె నానాఁట ను
న్నతికిన్ వచ్చుచు నాంధ్రసత్కవిత; పై నానాఁట క్షీణించుచున్
గతికిందక్క యధోగతిం బడి యెటో కాలూఁది మూలం బడెన్. 81

ఉ॥ అంతట హూణరాజ్యపుసమాదరణంబునఁ జేసి యొట్టులో
వంత నొకింతతగ్గె నటువాదినయాకవితాలతాంగికిన్;
సుంతవిచార మాపె విడి శోధకు వచ్చెదునంత నేదియో
చింత యొకండు వచ్చె నది చెప్పఁగ నేల జగత్ప్రసిద్ధమే. 82

ఉ॥ దానిని దెచ్చి పెట్టిన విదగ్ధులుఁ గూడ మహోపకారమున్
బూని యొనర్ప నెంచిన ప్రబుద్ధులె కాని మరేరుఁ గారు వీ

ర్వ్యసనమందు నుజ్జగను మాఱువఁ బోయినఁ గోఁతి యాట సం
ధానము చేసె దేవుఁ డధి తజ్జులు తీరుచఁ బూని రంతటన్. 83

తే॥ గీ॥ ఆంధ్రభాషాపరిషదాఖ్యసభలు మిగుల, సభ విమర్శించి కవితను సంభవించి
నట్టి కష్టమ్ము దీర్చ నూయనఘులార, ప్రాజ్ఞులార మదాంధ్రసుప్రతివాసులార.

సీ॥ మీయాంధ్రపరిషత్తు మేదినీనాథుల యాదరణకుఁ బాత్ర మగును గాక
మీయాంధ్రపరిషత్తు మేటివిద్వత్కవీంద్రులకు నానందమ్ము గొలుపుఁ గాక
మీయాంధ్రపరిషత్తు జాయమానానేకకృతుల కానందమ్ము నిచ్చుఁ గాక
మీయాంధ్రపరిషత్తు రాయలవారి యాస్థానంబుతో గోష్ఠి సల్పుఁ గాక

గీ॥ దీనిఁ బోషించు నృపులకు, దీనియందుఁ, బట్టుదల గల్గి పని చేయు పండితులకు
నాయు రారోగ్యములనిచ్చి యాంధ్రకవుల, కబ్బములు పేర్మిమన్నించి కాచుఁ గాక.

## భారతసంస్కరణమును గూర్చి.

గ్రంథపరిశోధకులారా! ఈక్రింది సంశయములను దీర్పఁ బ్రార్థించుచున్నారము. లక్షణగ్రంథములెల్ల భారతము నాశ్రయించియే పుట్టియున్నవి. కవిమండలమెల్ల భారతము ననుసరించియే తమతమ కబ్బముల వెలయించియున్నది. భారతము నాంధ్రముగా నొనర్చిన కవులు మూఁగురు. అందొకరికొకరు తీసిపోవువారు గాకున్నను ప్రాథమికుఁడగుటచేత నన్నయ్యభట్టారకునియం దెక్కుడు గౌరవమును గొందఱు లాక్షణికులు సూచించి యున్నారు. ఇందుల కప్పకవీయములోని.

ఉ॥ ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పినభారతమ్ములో, నేదివచింపఁగాఁ
బడియె.

అనుపద్యమును, అహోబల పండితీయమున నన్నయ ప్రయోగసరణిని మహాభాష్య కారవచోరచనబలెఁ గైకొని యక్కడక్కడఁ దిక్కనాదులవచోరచనల ఖండించు పద్యమంబును, బోధకములు కావచ్చునుగాని, వారుమూఁగురును నాంధ్రకవిలోకమునకు మార్గప్రవర్తకులే కావున మూర్తిభేదముంజేసి వారిలో వారికొక్కింత భేదమున్నను మనకువారు ముగురు నొకటేతీరున శిరసావహింపఁదగినవారు. భారతమెల్లఁ బ్రమాణమే యగునుగాని భారతైక దేశము మాత్రమే ప్రమాణమై తదితరము కాదనుటకు వలనుపడదు. ఈసిద్ధాంత మనా

దిగా తప్పుచున్న ది గాని నేఁటిది కాదు.

చ॥ ఎవరు కవిత్వముం జలిపి రేనియు భారతపుం బ్రయోగముల్
చవి గొనియే రచించిరి విచారణ చాలనిచోట నన్యథా
భవనము గల్గుఁగాక పొరపాటది దానికినేమి నేఁడు మీ
రెవియొ కతప్పు లేర్పఱిచి యేటికి భారతముం గలంచుటల్.

ఉ॥ భారత మిల్లి యుండు నని పండితమండలి నమ్మి దానియా
ధారమునం గవిత్వము పదంపడి గట్టికొనెన్ గదా! తదా
ధారముఁబట్టి లాక్షణికతండము లక్షణముల్ రచించె నేఁ
డారసి దిద్ది యేమి ఫలమయ్యె చెడుంగద వారిపూనికల్.

ఇయ్యది మహావిషయము, స్వల్పముగా వ్రాసినం దేలెడునది కాదు. దిక్ప్రా త్రము నేఁటిదిద్దుబాటులనుజూపి వానివలన వచ్చెడిహానుల నుదాహరించు చున్నారము.

క॥ జ్ఞానము కేవలకృపన, జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము,

ఈపద్యములోని ద్వితీయచరణమున నుండు యతి నాధారము చేసికొని అప్పకవి.

“సోమయాజులు వాడుక తన”.

అని హేతువును జెప్పుచు జ్ఞాతును కాతును విభ్రమమును విధించి యున్నాఁడు. ఇటీవల దీనిని.

“ప్రజనితము”.

అని దిద్దియున్నారు. ఈపాఠము వెనుకటిపాఠమునకన్నఁ దీనిపోవుట యటుంచి దీనింబట్టి యప్పకవిలక్షణమేమి కావలయునో, అతనిం గాని తిక్కన్నగారి ప్రయోగముం గాని యనుసరించిన కవుల ప్రయోగములకు నేమిగతి చూపితిరో తెలుపఁగోరెదము. మఱియు.

క॥ నమ్మమిమృత్యువు పెద్దయు, నమ్మట యపమృత్యువగుట నరపతినమ్మి
నమ్మకవనిఁగొనువదిని,త్యమ్మునుసూక్ష్మమతిదానచతురయుఁగవలయున్
శాంతి—౪—ఆ 350వ పద్యము.

ఈపద్యములో నిన్న మొన్న నచ్చైనభారతములో.

“నరపతి మిత్రుఁ, న్నమ్మి పనులు గొనుపది.

అని విపరీతమైన మార్పు కనుపట్టుచున్నది. ఆమార్పువలనఁ దిక్కన్నగారి యభిప్రాయము పూర్తిగా ననన్యథాత్వమునందుటయే కాక సంస్కృతభారతమునకుఁ గూడ వైరుధ్యము కలుగుచున్నది.

శ్లో॥ ఏకాంతేనహి విశ్వాసః కృత్స్నో ధర్మార్థనాశకః । అవిశ్వాసశ్చ సర్వత్ర మృత్యునాచ విశిష్యతే । అకాలమృత్యుర్విశ్వాసో విశ్వసన్ హి విపద్యతే । యస్మిన్ కరోతి విశ్వాస మిచ్ఛత స్తస్య జీవతి । తస్మా ద్విశ్వసితవ్యంచ శంకితవ్యంచ కేషుచిత్. ఏషానీతిగతిః—

(శాంతి— అశీతతమాధ్యాయము ౯వశ్లోకము మొదలు ౧౨ వఱకును జూడఁదగు )

తిక్కన్న సోమయాజి.

“క॥ నమ్మమి”.

అను పద్యమునందు పైశ్లోకముల తాత్పర్యము సూత్రప్రాయముగా నిమిడ్చి తనయసమానకవితాధురంధరత్వమును వెల్లడించెను. ఆశ్లోకానుసరణమున కొప్పికొన్నచో.

నమ్మినమ్మక.

అను పాఠమునకుఁ గలయోగ్యత

“మిత్రు న్నమ్మి”.

అను పాఠమునకు లవమును గలుగ నేరదుగదా! అయినచో నీదిద్దుబాటెంత బాధకరమో పరికింపుఁడు.

తే॥ గీ॥ సంస్కృతపు భారతమునకు సంకటమ్ము
తెలుఁగుఁ బ్రతుల కన్యోన్యము కలఁతపాటు
తదను సారికవీంద్రుల దారికడ్డు
భారతం బిట్లు దిద్దుట పాడియగునె.

మహాకవియగు సోమయాజిగారి.

“నమ్మీనమ్మక”.

ప్రయోగము దిద్దఁదగిన స్థలమందు లేమిం జేసియేకదా! శ్రీనాథుఁడు.

“వినీవినక”.

యని తన శృంగారనైషధమందుఁ బ్రయోగించికొనియె, మఱియు. ధూర్జట్యాదులు.

“రోసీరోయక” “చేసీచేయక”.

లోనగునవి ప్రయోగించికొనుట కాధార మాయెక-ప్రయోగమే కదా! దానిని మీరురూపుమాపి తిక్కన్నగారికజ్ఞతను గల్పించుటయే కాక యిట్టివలి మహాకవులకెందఱికిఁ గల్పింపవలసి వచ్చునదో విచారించుకొనుఁడు. ఆప్రయోగము వ్యాకరణసిద్ధముగాదని దిద్దితిరో! అట్లైన, యెన్ని చోటులనో భారతము దిద్దవలసివచ్చును. దీనికి సమగ్రముగు వ్యాకరణమింకను జనింపలేదు, సంస్కృతమునకు మహాభాష్యప్రయోగమెట్టిదియో తెలుగునకు మహాభారత ప్రయోగ మట్టిది. సూత్రకారుని సమ్మతిలేకున్నను భాష్యకారునిప్రయోగమున్నచో నది సూత్రమును బుట్టించును. అట్లే మహాభారత ప్రయోగమునను నిర్ణయింపఁగఁ దగు.

చ॥ “వరదుఁడు” అను పద్యములో “వృత్తికిన్నరుదుగ”.

అనుప్రయోగముండుటం జేసి పోతన్నగారు తమభాగవతమునందు.

“సర్వమున్నతని”.

లోనగుప్రయోగములు ప్రయోగించికొనిరి. అహోబలపండితీయరచన వలనను పైభారత ప్రయోగమట్లే యున్నదనుట కాధారముకలదు. ఇటీవల దా

నిని దిద్దిరి. మఱియు.

“మదీయభాషిత మెన్నఁడు, న్నేని”.

అనుభారతప్రయోగమున కీమధ్యనొకరసజ్ఞానిద్ధిని దెల్పుచు నాంధ్రభార తిలో నొకవ్యాసమును బ్రకటించియున్నారు. అందు.

“ఉందును” అనురూపమునకు “ఉన్న” అనునది రూపాంతర మనియు, కావుననే “ఉన్నే”.

ఇత్యాది మహాకవి ప్రయోగములు సంగచ్ఛమానము లగుచున్నవనియును నభిప్రాయపడి.

ఎన్నఁడు† ఉన్న† ఏని.

అనివిడఁదీసి.

ఎన్నఁడున్నేని.

ప్రయోగమును సాధింపసాహసించిరి. కాని అది సరియైన త్రోవ కాదు. “ఉందును”. అను దానికి “ఉన్న” అనిరూపాంతరము లేదు. “ఉన్నే” అనునది నిపాతమని శబ్దరత్నాకరములో వ్రాసిన మార్గమే యుక్తమైనది. ఆరూపాంతర మున్నదనుకొన్నను. “ఉందును” అనుదానికి “ఉన్నను” అనియుండును గాని “ఉన్న”అనిమాత్రముండదు. అయినచో, ఉన్న నేని, అగును గాని “ఉన్నేని” కాదు. విస్తరింపవలసిన విషయమేయైనను ప్రకృతము గామింజేసి యుపేక్షింపవల బడియె. వీరుతమయభిప్రాయమును మాత్రము తెల్పిరి కాని యేపుస్తకమును దిద్దినవా రు కారు. పైవారో! ఇచ్చవచ్చినట్లెల్ల దిద్దుచున్నారు..

“చేతుఁగ”.

అనుప్రయోగము లొకటిరెండు భారతములో నున్నవికదా! యని శ్రీనా థాదులు ప్రయోగించికొనిరి, చిన్నయ్యసూరిగారు దానినిమాట దక్రించుకొ నిరి. పదపడి ఈప్రయోగము బాలనికూడఁ గొందఱు వ్రాయసాహసించుచు న్నారు. బాలవ్యాకరణములోని వ్రాఁతనాధారము చేసికొని ఆరెండు ప్రయో గములును.

చేయుఁగ అని యొకటియు, నేతుఁగ అని యొకటియు.

దిద్దివేయఁబడినవి. సూరిగారువిశేషపరిశీలకులే యైనను భ్రాంతి పురుష
ధర్మముగాన నెందేనిఁ బొరపాటురావచ్చును. దానిఁబట్టి భారతము దిద్దుట
కన్న బాలవ్యాకరణమే దిద్దుట యుక్తముగదా! లేదా సంస్కృతవ్యాకరణము
వేదమును దనశిక్షకులోఁగని దానిఁగాఁదలఁచి వదలినట్లు భారత మీవ్యా
కరణములకు లోఁగనిది యనియేని భావించుటయుక్తము. అంతియకాని యిప్పటి
వాఁరలంబట్టి దానిని సవరింపఁబూనుట "రాట్నమురాకకు బండి తప్పికొనుట"
వంటిది కాకతీరదు. సన్నయ్యభట్టు.

చ॥ అమలినతారకా సముదయమ్ముల.

అనుపద్యములో మహాభారతమును సముద్రముగ రూపించి.

"సముద్రము దరియంగనీఁదను విధాతృనికైనను నేరఁబోలునే.

అని సొక్కపరాక్రమించి యున్నాఁడు. అట్టివాగను శాసనునికే మహా
భారతమట్టిది యైనచో నితరులు దానిని దరింపఁగలరా! అందిప్రయోగముమాత్ర
మేయున్నది. ఇదిలేదు. అని నిశ్చయింపఁగలరా! అట్లుచేయఁగలమనుటకాని
కలరనుట కాని సాహసమాత్రమని మాయభిప్రాయము. ఇట్టిదుష్కరవిషయ
ములలో నేఁటిపరిశోధకులు మిక్కిలిగ సాహసించుచున్నారు. 1910 వ సం॥
అచ్చయిన యుత్తరరామాయణ పీఠికలో ౧౨ వ పుటలో.

"పోవలయున్" అనుటకు బదులు "పోవలెన్" అనియును,
"కావలయున్" అనుటకుబదులు "కావలెన్" అనియు.

పావరాజుగారు ప్రయోగించినట్లును అదిప్రాచీన మహాకవి సమ్మతము
కాని యట్లును వ్రాయఁబడియున్నది. భారతములో, ఉద్యోగములో 3 వ ఆశ్వా
సమున.

"ఉ"... శ్రీ "గావలె" నంచు

అని తిక్కన్నగారు వాడియున్నారు. అది యిప్పటివఱకేరును దిద్దలేదు.
ఈ పీఠికననుసరించి యెవరేని ముందుఁబుణ్యము గట్టికొందురని యూహింపవలసి
యున్నది. మనపరిశీలకతా లోపము గ్రంథకర్తలయందుఁ బెట్టుటన్యాయముకా
దని పరిశోధకులను వేఁడికోవలసియున్నది. తిక్కన్నగారు శాంతిపర్వమున.

"అడరు" అనుపదమును, సంకటము, అను నర్థమునఁ బ్రయోగించిరి.

దానింబట్టి ఆముక్తమాల్యదలోఁగూడ నదే యర్థమున శ్రీకృష్ణదేవరాయలు ప్రయోగించెను. తిక్కన్నగారి ప్రయోగము యతిలో లేమింజేసి నిన్న మొన్నటి భారతమున దిద్దఁబడినది. ఈదిద్దుఁబాటునకు హేతువు శబ్దరత్నాకరములో నది యాయర్థమున వ్రాయకుంటయే, నిఘంటువుంబట్టి కవిత చెప్పువారుందురు, ఉన్నచో.

"పుంసివాకొమ్మెక్కి".

అనులోకోక్తికి భాజనులగుదురు, లోకానుసరణముంజేసియుఁ బూర్వమహాకవుల రచనల ననుసరించియుఁ గవితాధార ప్రవహించెడిని, ఆ పూర్వమహాకవి ప్రయోగముల ననుసరించి నిఘంటు వ్రాయువారొక కొన్నిటిని వదలినచో నీనిఘంటువువలన నవి దిద్దఁబడి తుదకుఁ దదనుసారులకు నచ్చుట తటస్థించుచున్నది. యతిస్థానమున లేదని దిద్దుదురేని యెన్నియో దిద్దవచ్చును. తెల్గున నింత సాహసించుచుండిరే కాని సంస్కృతమున సాహసించుటలేదు.

అవైహి, అవేహి,.

అనురఘువంశ పాఠమునకు సంబంధించిన చర్చవలనఁ బైసంగతి విస్పష్టమగును. కేవలయతిప్రాసస్థానములం బట్టియే, యీపదము కారాది యనియు నిది యికారాది యనియు నిర్ణయింపఁబూనుచో శబ్దరత్నాకరాదులగు నేఁటినిఘంటువులలో ననేకములు పోవలసివచ్చును. సుప్రసిద్ధులగు పెద్దలవ్రాఁతప్రతులనే తఱచుగాఁ బ్రమాణీకరించికొనుచుఁ బూర్తిగాఁ దప్పుగాఁదోఁచినచో నదివ్రాఁత పొరపాటనుకొని దిద్దికొనుట యుక్తముగాని యేదియైనను నేఁటినిఘంటువులలో లేదని ప్రాచీనగ్రంథములు దిద్దుట యుక్తముగాదు. అశ్వమేధపర్వములో.

"అతనికాహారమొసరఁ, జేసికొనుట కతివముయి చెల్లుచుండ,!

అని తిక్కన్నగారి ప్రయోగము ప్రాచీనప్రతులయందేమి యిటీవలఁ గొంతకాలము క్రిందు నచ్చైన ప్రతులయందేమి కానవచ్చుచున్నది. దానిని.

"దుర్ఘటముయి,, అనిదిద్దిరి.

వీరితాత్పర్యమిది. కఠినశబ్దమునకు కష్టము అనునర్థము నిఘంటు ప్రసిద్ధము కాదు గాన దిద్దవలయును. లేనిచోఁ దిక్కన్నగారి కజ్ఞత సంభవించును. అనిరాజించినట్లు పొడకట్టెడిని. "దుర్ఘటము" అని దిద్దిన దిద్దుపాటు హృదయంగమము కాదని మాయభిప్రాయము కాదా. కానితిక్కన్నగారి ప్రయోగ మౌపచారికమనియు వారు లోకము ననుసరించి యట్లు ప్రయోగించియుండిరనియు దేశభాషలవిషయమున. "వ్యవహారతశ్చ"

అను నదియే శబ్దగ్రహోపాకరణములలో నెల్ల మిన్నయనియుఁ జెప్పచున్నారము. భారతములో.

"దిక్కు" అనునది పలుచోట్ల "శరణము" అనునర్థమున వాడఁబడియున్నది.

ఇదిసంస్కృతపదముగదా! దీని నేసంస్కృతకవిగాని శరణార్థకముగా వాడినట్లు లేదు. లోకమందో,

"వాఁడు దిక్కుమాలిన వాఁడుగా నున్నాఁడు".

లోనగుచోట్ల శరణార్థకముగా వాడుచున్నారు. దానింబట్టియే తిక్కనాదులు వాడియుండిరి. అట్లే లోకమున దరిద్రుఁడు "నాకు సంసారము గడపి కొనుట కడుఁగఠినముగా నున్నది" యనియును "దుర్ఘటముగా నున్నది" యనియును వాడుట కలదు. ఈదుర్ఘటపదముకన్నఁ బలువురు "కఠిన" పదమునే ప్రయోగింతురు. తదనుసారముగఁ దిక్కన్నగారు వాడఁగా దానినేలదిద్దవలెను? దిద్దిరిపో! పాఠాంతరముగా నేని ప్రాచీనపాఠమును జూపకపోవుట యన్యాయము కాదా! సామాన్యముగాఁ బరికించినచోఁ గుదురని ప్రయోగము లనేకము లున్నవి. అవియెల్ల దిద్దుట యుక్తమా! ఒకచో.

"చతుర్దసుల నుభయపక్షవశోత వచ్చు"

అని శనలకుఁ బ్రాసము భారతమునఁ దిక్కన్నగారువాడిరి. దీనింబట్టి యిటీవలి కవులు ప్రాసస్థానముల సీయభేదమును గైకొనుచుండిరి, అదియిప్పుడు దిద్దఁబడినది. శోధకులకు గ్రంథస్థపాఠము హృద్యమని తోఁచనియెడలఁ బీఠికలోఁ దమయభిప్రాయమును దెల్పి యిట్లు దిద్దినచో యుక్తమని మాత్రము వ్రాయుటతో విరమించుట యుక్తమనితోఁచెడిని. భారతాంకములలో నచ్చటచ్చట నఖం

యతుల కాధారములు గానవచ్చుచున్నవి. కానింబట్టియే అప్పకవి "అఖండయతిపొల్పగు నాదికవిప్రణీతమై" అని కొంతయాధారమును జూపెను. ఇప్పటిభారతములో నాయాయిచోట్లు చాలవఱకు మార్పఁబడినవి. ఎట్టిదేనియు నదిభారతసమ్మతమైనచో మనము శిరసావహింపఁదగినదియని పూర్వలాక్షణికులమార్గమువలనఁ దెలిసికొనవచ్చును. చూడుఁడు.

చేసెఁ + మహా, అనునది ప్రాసస్థానమున «చేసెమ్మహా»

అగుట కేవ్యాకరణమని యంతముమున్నకలదా! అందులకుశబ్దానుశాసనుని ప్రయోగమేకదా? శరణము. అట్టిచో వారి బుద్ధిపూర్వప్రయోగముల నేలదిద్దవలయును? ఈదిద్దుఁబాటులనుగూర్చి ముందు విపులముగాఁ జూపఁబడును.

ఉ॥ దిద్దకుఁడయ్య భారతము దీనిని దానినిబోలె దాన నా
పద్దశ మూఁడి పూర్వకవిపద్యము లెన్నియొ వన్నెఁ దక్కు మీ
రెద్దియునేని దిద్దునెడ నించుక సంస్కృతి భారతమ్ముపైఁ
దద్దయుఁ జూడ్కినింపుఁడు పదంపడి దిద్దుఁడు హాని లేనిచో.

ఆ॥ వె॥ సంస్కృతిమ్మున కిది సమమైన తెల్గుగా
దందు రేమొ? నిక్కమగును గాని
యెల్లయెడల నట్టులే యుండ దొకింత
శ్రద్ధ గలిగి మనము చదువవలయు.

(సశేషము.)

(శృంగారరసమునుగూర్చి.)

ఈశ్వరునికిఁగూడ దేనిలోఁతు తెలియరానిదని మనపూర్వులు నిశ్శంకముగాఁ జెప్పసాహసించిరో, దేని రసమ్మున నిమగ్నులై బ్రహ్మానందాస్వాదమునుగూడ నంతగా మన్నింపక తృణీకరించుచుండిరో, దేనిసాహాయ్యమునఁ దమయశఃకాయము నస్థాయముగాఁ జేసికొని.

శ్లో॥ జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్

అను సూక్తి కుదాహరణములుగాఁ గలిగిరో అట్టిమహాకవుల సూక్తులయం దుఁ గూడఁ గొందఱు జ్ఞానలవదుర్విదగ్ధులు వృథాదోషారోపణము చేసి తమ యజ్ఞానవిలసితత్వమును బ్రకటించుచు.

“అహో మూలచ్ఛేదీ తవపాండిత్యప్రకర్షః”.

అను ప్రాచీనసూక్తికిఁ బ్రథమలక్ష్యకక్ష్యయందుఁ బ్రవిష్టు లగుచున్నారని వినుటకెంతయుఁ జింతింప వలసి యున్నది.

శ్లో॥ శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాఽభ్యాస ఇతి హేతు స్తదుద్భవే.

శ్లో॥ నస శబ్దో న తద్వాచ్యం న సా విద్యా న సా కలా
జాయతే యన్న కావ్యాంగ మహో భారో గురుః కవేః.

లాక్షణికు లుదాహరించిన పై శ్లోకముల వలన నేమి, యింకను వారి శాసనముల వలన నేమి కవి కాఁదగువానికి నానావిషయములయందుఁ బరిశ్రమ కల్గి యుండుట యత్యావశ్యకమై యున్నది. తక్కిన విషయము లట్టులుంచి ప్రకృత ముపన్యసింపఁ బూనుకొన్నది శృంగారరసమును గూర్చినది కావున దాని తత్త్వవేత్తృత్వమున కుపకరించు వాత్స్యాయన శాస్త్రపాండిత్యముగూర్చి కూడ లాక్షణికులు శాసించి యుండి రను నంశమును మఱవకుందురుగాక.

శ్లో॥ వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

శ్లో॥ అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
శృంగారీచే త్కవిః కావ్యం జాతం రసమయం జగత్
సచేద్వీతరాగశ్చే న్నీరసం సర్వమేవ తత్

ఇత్యాది లాక్షణికోక్తులవలన శబ్దార్థదోషదూషితము గాకుండ నిరంకుశముగాఁ గవివాణి ప్రసరింపవచ్చు నని తేలుచున్నది.

“నిరంకుశాః కవయః”.

అనువారోక్తి నేఁడు పుట్టినది కాదు. ఇట్లుండఁగా నేఁటివారు పూర్వ

లనాగరికులనియు వారయుక్తముగా శృంగారమును వర్ణించిరనియు నప్పుడు తగినపరిశీలకులు లేమిం జేసి యవి యట్టె నిల్చిపోయిన వనియు నేఁడంతకన్నమిన్నలగు పరిశీలకులుద్భవించిరి కావున వారు వానిని సంస్కరించి కొన్నిటికి మూలచ్ఛేదమును గొన్నిటికి నంగమాత్రచ్ఛేదమును విధించి ప్రబంధమునకు మహోపకార మొనరింపఁ బూని రనియు వ్రాయఁగా నీవిషయములను బత్రికలయందుఁ జదివికొని ప్రాజ్ఞు లనుభవించువిచారమునకుఁ బారమే కానరాకున్నయది.

‚‚దోషాఃఖలు సాకల్యేన పరిగణితాః”.

అని మహాభాష్యకారులు చెప్పినట్లు పూర్వలాక్షణికుల విమర్శనాముకురమునందుఁ బ్రతిఫలించనిదోషముగాని గుణముగాని నేఁటినాగరికుల హృదయాదర్శమునందుఁ గోచరించునది లేశమును నుండదని చెప్పుటకు జంకవలసి లేదు. వారు సంభోగశృంగారవర్ణనము దూష్యమని యొకచోఁ గాకున్న మఱియొకచో నైన నొకరు గాకున్న మఱియొకరేని వ్రాసినట్లు మామాగురువులు మాకెవ్వరికిని నుపదేశించినది లేదు. ఎవరేని యొప్పుట నేని యీవిషయము త్యాజ్య మని వ్రాసిన దున్నచోఁ దెల్పి యీసంస్కరణమునకుఁ బూనినచో దీనిని శిరసావహించుట కభ్యంతరము లేదు గాని వట్టిపొడిమాటలచే మహాకవుల కావ్యములను దుష్యదూషి గావించ యత్నించువారి వాక్యములను విశ్వసింపఁ జాలము సరికదా! పైపెచ్చు మాకుఁ గల ప్రాచీనలాక్షణిక గ్రంథవిశ్వాసముచే నవ్వారియుక్తులను ఖండించి మాకృతజ్ఞతను బ్రకటించుకొని యాజన్మమునకు సార్థక్యమును గల్పించుకొనుటకు సంసిద్ధులమై యున్నారము.

‚‚అదోషౌ సగుణౌ సాలంకారౌ కావ్యమ్”.

అని కావ్యలక్షణమును జెప్పుచు మొట్టమొదటనే “అదోషౌ” అనువిశేషమును సంఘటించినవారి శాసనము కన్న నితరుల పొడిమాటలు మాకుపాదేయములు గావు.

శ్లో॥ ‚‚తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన,
స్యా ద్వపు స్సుందరమపి శ్విత్రే ణైకేన దుర్భగమ్”.

అని చెప్పినమహాభాగులు సంభోగశృంగారమును వర్ణించుట దోషముగాఁ

పరిగణింపఁబడిరి. అట్టిచో దాని నితీవల నిన్న మొన్నటి వారేల గర్హింతురో మా కెఱుఁగ రాకున్నయది. అది రహస్యవిషయ మనియు గోప్యతయవగోపన మెంత యావశ్యకమో ఇదియును నంతయావశ్యకమనియుఁ జెప్ప వత్తురేమో? వాదసౌకర్యమునకు క్షణకాలము వీరియుక్తి నొప్పుకొందుముగాక, ఈవిషయమును కూడఁ బూర్వులే కనిపెట్టియున్నారు. దీనిని ప్రత్యక్షముగాఁ జూపరాదని నిషేధించిరి. వర్ణింప రాదని నిషేధించిన వారెవ్వరును గానరారు. అనిషేధమును ప్రధానముగాఁ జేసికొని యీవాదమునకు దిగుట యుక్తము కాదు. ఇదిగాక యౌచిత్యమునుబట్టి సంభోగ శృంగారవర్ణనావిషయమునఁ గొందఱు పూర్వలాక్షణికులు కొన్ని రహస్యములను దెల్పియున్నారు. అందొకటినిటఁ జూపుచున్నారము. పార్వతీపరమేశ్వరాది విషయమును పితృమాతృవిషమును మఱియుఁ దత్తుల్యవిషయకమును నగు సంభోగ శృంగార మంతగా వర్ణ్యము కాదని కొందఱు నౌచిత్యవిదులు వ్రాసియున్నారు. అట్లు వ్రాసిన వారే కాళిదాసాదులు వర్ణించిరని కూడ నుగ్గాటించి కొంత చర్చించి "తథాపి" అని యేదో పరిహారోక్తిని జూపియున్నారు. అది యిటనంతగాఁ బ్రస్తుతము కాదు. ప్రకృతమా విషయము నెత్తికొనుటకుఁ బూర్వులు సర్వజ్ఞులనియు వారికి మనకన్న నెక్కుడుశంకలే తోఁచెడివనియు నట్టివారేగాను నిషిద్ధంపవిషయమును మనము తెలిసియుఁ దెలియనిజ్ఞానముతో బయటికిఁ బెట్టి పండితులయు రహస్యముల కాస్పదత్వమును వహించుటయేకాక యీ యవకాశమున్న మనకు లభించిన యోగ్యతనుబట్టిగాని మఱియొకదానిఁబట్టిగాని వారిగ్రంథములను భస్మసాత్కరింపఁ బ్రయత్నించుటకన్న మహాపాపము వేఱుండఁ బోదనియు సిద్ధ్యది.

"వచనాత్ప్రవృత్తిః, వచనాన్నివృత్తిః".

అను శాసనమును బట్టి వైద్యప్రయత్నము కాకుండుటకే సంప్రాజ్ఞుఁడగు చికిత్సకుఁడు నిరుత్సాంగమును దుష్టాంగభ్రాంతిచే ఛేదించి యంగవైకల్యము నాపాదించి పిదపఁ బశ్చాత్తప్తుఁడైనట్లు పరిణమించెడి ననియు నుదాహరించుచున్నారము. వెనుక నెవఁడో ముగ్ధుఁడు తన భార్యకు యౌవనచిహ్నములు కానరాఁగా నయ్యవి పిటకము లని.

"భ్రాంతిపడి".

తియ కాని విస్తరించి వర్ణించిన కావ్యమునకు త్యాజ్యమని కాని వరణీయము కాదని కాని భాషకు నష్టముకల్గించునని కాని దేశోపద్రవకరమని కాని యెవ్వరును ప్రాజ్ఞులు చెప్పసాహసింపరు. రసమునఁగాఁ దన్మయత్వము నందించునదియే.

“క॥ ఏరసము చెప్పఁబూనిన, నారసమాలించువారి వలదింపని యా
నీరసపుఁ గావ్యశవములఁ, దూరముననపరిహరింపుదురు నీతిజ్ఞుల్”.

విభావానుభావాదులచేఁ బూర్తిగాఁ బోషింపఁబడనిరసము స్వరవిన్యాస మూర్ఛనాదులచేఁ బోషింపఁబడని రాగమువలె వికలావస్థనందును. కావున నే శృంగారరసాలంబన భూతులగు నాయికా నాయకుల విషయమునఁ బూర్తిగాఁ వర్ణించుటయనఁగా చక్షుఃప్రీతి మొదలు క్రియానిర్వృతివఱకును నభ్యనుజ్ఞనిచ్చియున్నారు. అగనిమ లీకర్మముఁ నెఱుఁగక గురుశుశ్రూష లేక నిర్భయముగా నేమో యాక్షేపింపఁబూనుటయె కాక వృథాప్రయత్నములొనర్చుట కడుశోచనీయము. ప్రతిమనుజుని జన్మమునకును ముఖ్యకారణమగు శృంగారరసము నెంతయభ్యర్హితముగాఁ బరిగణింతుమో దానినెంత పోషించికొనఁ నెంతుమో అప్పుడే మనకునత్యంతానన్దప్రాప్తి కల్గి యిహపరలోకములయందు సుఖము నిర్బాధముగునని యెఱుఁగునది. ఇదిగాక ప్రతివిద్యార్థియును బహుకావ్యపఠనానంతరము కేవలశృంగారరసపూరితములగు భాణప్రహసనాదులు చదివి సాహిత్యజ్ఞానమును సంపాదించికొనుచున్నాఁడు. దానిని నేఁటివఱకు నేగురువును నిషేధించి నట్లులేదు. తత్పఠనము వలన నేవిద్యార్థియుఁ బాడైనట్లు వినము. ఎవఁడేని యొకఁడుండిన నది యన్యథా ఘటించినను ఘటింపవచ్చును.

“నహ్యేకం లక్ష్యం సామాన్యధర్మం పరిత్యాజయతి”.

కావున నంతమాత్రమున నది శాస్త్రమునకుఁ బ్రతికూలకత్వము సాధింపనేరదు. శృంగారకావ్యపఠనమునకుఁ బ్రసరించినట్లు నవనవయౌవనులగు విద్యార్థులహృదయములు భగవద్గీతాపఠనమునకుఁ బ్రయత్నింపవు- కల్పించి మనమెట్లు మఱలించినను లాభము లేదు. ఏవో శోధించు గ్రంథములను జదివినంగాని సాహిత్యజ్ఞానము కుదురదు. చక్కని సాహిత్యజ్ఞానము కుదిరినవానికిఁ గావ్యరసాస్వాదన మనసెట్టిదియో తెలియుట కడుసుకరము యగును గాన భాణప్రహసనాదులవలనఁ దెలియఁదగు నీతి విటాది ప్రవర్తనము హేయభావన

మనియు సత్ప్రవర్తన మావశ్యకమనియు నేకాని యన్యము కాదని విస్పష్టము. దానిచే వాఁడు విటుఁడు కాక విటవృత్తమును దెలిసికొనిన వాఁడుకూడ నగును. దానివలన మున్నుదాహరించిన,

«శ్లో॥ నపశబ్దం».

అను శ్లోకమునఁ గల కొన్ని విషయము లనాయాసముగాఁ దెలిసికొనిన వాఁడుగూడ నగును. ఇప్పటి నవనాగరికుల సాహసమును వర్ణించుటకు నాకుం బదము నుపాయము దోఁచకున్నయది. వీరికిఁ గచాదివర్ణనమే దూష్యమగు నెడల దశరూపకములును, తద్గ్రంథకర్తలును, తచ్ఛాస్త్ర విధాతలునుగూడ దూష్యులే కావలసివచ్చునుగదా! ఆయాగ్రంథములెల్ల దుర్నీతినే బోధించు నెడల నిందలనుగూడ నట్టి దుర్నీతిని సమ్మతింతురా! వారెల్లరును సమస్తశాస్త్రములను నభ్యసించి ధర్మాధర్మము లెఱింగి వానిని వేదపురాణాదులచే బోధించుటకన్న కావ్యరూపమున బోధించుట సుకరమని యెంచి కదా యిందుఁ బ్రవర్తించియున్నారు. కావుననే సాహిత్యకౌముదిలో, ప్రభుసమ్మితమగు వేదముకతనఁ బ్రభువులు దక్క నితరులు శాసింపఁబడుదురనియు మిత్రసమ్మితములగు పురాణాదులకతనఁగూడఁ బ్రభువులు నియమముగా శాసింపఁబడుట దుశ్శక్యమనియు శంకించికొని కాంతాసమ్మితమగు కావ్యము చక్రవర్తినిగూడఁ గడు సుకరముగ లోఁగఁజేసికొని సత్కార్యప్రవర్తనమునందును నసత్కార్య నివర్తనమునందును బ్రవర్తింపఁజేయునని వాక్రుచ్చియున్నారు.

«కావ్యాలాపాంశ్చ వర్జయేత్».

అను నిషేధముకూడ సంభోగశృంగారాదివిషయములుండుటచేఁ జదువఁగూడదని ప్రవర్తించి యుండలేదు. సంభోగ శృంగారమును నిషేధించినచోఁ దదంగభూతములగు చక్షుఃప్రీత్యాదివర్ణనలకు సార్థక్యమే యుండదు. ప్రధాన దేవతకుఁ బూజలేనిపట్టున నంగదేవతలకుఁ బూజ నంగీకరించు వారుందురా!

«అంగానాం ప్రధానఫలేనైవ ఫలవత్త్వాత్».

ఇఁకఁ బూర్తిగా శృంగారము త్యాజ్యమని తేలును. తత్త్యాగము సిద్ధమగునేని తన్మూలకము లగు రసములన్నియుఁ ద్యాజ్యములు కావలసివచ్చును. ఏవో కొన్ని రసములు మిగిలినను నయ్యవి యట్టియానందమును గలిగింపనేరవు,

కావుననే యీరసమునకుఁ బ్రాధాన్యమునొప్పి పూర్వప్రాజ్ఞులెల్లఁ దమతమ ప్రావీణ్యమును జూపియున్నారు. ఆయా విషయములకు లక్ష్యలక్షణములు గీర్వాణభాషయందే కల్గియున్నవి. అది అంతో యింతో చదివిచూడక స్వతంత్రించు వారికిఁ జెప్పఁదగు ప్రత్యుత్తరమేలేదు. ఏవిషయము నేని సంస్కరించు వారు శాస్త్రవ్యతిరేకమును గనఁజేసి సంస్కరించుట యుక్తము. కుజాదిమతములను శంకరాచార్యులట్లే ఖండించి నిజమగు వేదమతమును నిల్పియున్నారు. భ్రమప్రమాదాదిదోషసంయుతమును బక్షపాతాదిసంవృతమును నగుమనుజునిమనము సంస్కరణస్వాతంత్ర్యమును వహించుటకుఁ దగదు. కావుననే లక్షణగ్రంథములు పుట్టియున్నవి. అందుఁ బలుమతములు గలవు. వారిమతములలో దేనికిఁగాని పాదుపుస్తకము లేవేని యున్నచో నయ్యవి సంస్కార్యములో బహిష్కార్యములో కావలసివచ్చునుగాని లక్షణజ్ఞుల పోకడలకు సంబద్ధము లైనగ్రంథములను వ్యర్థాశంకలవలన నాక్షేపించి మననాగరికతకే కాక మనపూర్వులకెల్ల నపకీర్తి నార్జించుట మనకు యుక్తముకాదు, వెనుకటి లాక్షణికులు చూపినమార్గము ననుసరించి గ్రంథములు చెప్పినమనపూర్వులను, మనము తద్గ్రంథములను జగువక యేదో నొకరాత్మసిద్ధాంతమును బురస్కరించికొని త్యజించి క్రొత్తచట్టములను విధించితిమే యనుకొనుఁడు, నిర్వ్యాజముగ—

శ్లో॥ బ్రాహ్మణేన నిష్కారణో ధర్మ, ష్షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ॥

అను తెలుఁగున విద్యనభ్యసించి లోకోపకారమునకుఁ దమజీవితమును వెచ్చించిన వారిపోకడలే నింద్యమగునెడల నవ్యాజముగ విద్యనభ్యసించు మనశాసనము మాత్రమెంత కాలము నిలువనేర్చునో? ప్రాజ్ఞులు విచారించుకొందురుగాక. శృంగారవర్ణన విషయమున ధర్మశాస్త్రాది ప్రతిబంధకమునుగూడ మహాకవులు పరిగణించినట్లులేదు. కాళిదాసు, శకుంతలాదుష్యంతసమాగమమును బగటికాలమందు జరిగినట్లు వర్ణించియున్నాఁడు. ఇదిధర్మశాస్త్రవిరుద్ధము. దీనివలన గ్రహింపఁదగిన నీతికాముకునకు శాస్త్రోల్లంఘనముగూడఁ దృణప్రాయముగనుండును. కావున కాముకుఁడు కాకుండుటకై యత్నింపవలసినది. యనునర్థమేకాని దోషోక్తికాదని కావ్యరసజ్ఞులు నిర్ణయింతురు. ఈ విషయమున నియమమును పాటించుట ఛాందసత్వమని కొందఱు తెల్పియున్నారు.

"శ్లో॥ సామగాయనపూతం మే, నోచ్ఛిష్ట మధరం కురు
ఉత్కంఠితాసిచే ద్భద్రే వామం కర్ణం దశస్వ మే"
"కావున నెల్లరుఁ గవులు...యీగతి నుండుసటం చెఱుంగునే"

(మానానారాజసందర్శనము చూడుఁడు.)

ఇదియిట్టులుండఁగాక, ప్రతిలాక్షణికుఁడును రసలక్షణగ్రంథమునందు
"శ్లో॥ నిశ్శేష చ్యుతచందనమ్,,

అను శ్లోకమునెత్తికొని చర్చించియున్నాఁడు. కవకుచాదివర్ణనము వనికి రానివారికాయాగ్రంథములేల కనికివచ్చును. నాయికాదిభేదములను నిర్వచనము చేసి లక్ష్యములను జూపిన రసమంజర్యాదు లేలకనికివచ్చునో తుకతుఁగావ్య ధోరణి ధర్మశాస్త్రరీతిని జెప్పవలసినదని తేలును. దానిచేఁ గాంతాసమ్మితత్వము మూలఁబట్టును, దానితోఁ జమత్కారకారిత్వము డుగంటును. దానితోఁ గావ్యమనఁగా—

"తుమ్మచెట్టుమీఁదఁ గాకి గూర్చున్నది తుపాకి తేరా కొడదాము"

అనునదియే కావలసివచ్చును. అంతదుస్థితియింకను మన సంస్కృతాంధ్రములకుఁ బట్టెనని తలఁచెదను, ఏమందురా! మన దేశమునందే కాక జర్మనీలోనగు దేశములయందుఁగూడ మన మాతృభాషావిషయక పాండిత్యముకలవారు పెక్కుండుండియున్నారు. వారలీవిషయము నన్యభాషాధ్యేతలపాలు చేసి యున్నకుందురని తలఁచెదను. ఇయ్యది నిన్న మొన్న తలచూపి వృద్ధి నందుచున్నయాంధ్రభాషపైఁ బడుట చేఁగాని సంస్కృతభాషపై వచ్చినచో నీనాఁటి కెందఱు మహాపండితులు కాశ్మీరాల నుండివచ్చి యెట్టియుపన్యాసములనిచ్చియుందురో తెలియవచ్చెడిని. ఆంధ్రము సర్వమును సంస్కృతలక్షణమును బురస్కరించుకొని వర్తించుచున్నది. ఆగ్రంథములను జదివికొని మన పూర్వులాంధ్రమునఁ గవిత్వమును రచించిరేకాని అరబ్బీభాషనుగాని, పేఁలాకభాషనుగాని, యథ్యయనముచేసి రచించిన వారుకారు. కావుననే సంస్కృతసాహిత్యవేత్తలకు మనయాంధ్రగ్రంథములయందు నేఁటి నవనాగరికసోదరులాపాదించుదోషములు కనుపట్టవు. ఇప్పటికే విస్తరించఁ

బడినదిగాన మన పూర్వుల పరిశీలనాజ్ఞానము నెక్రంత యాశ్లాఘించి విరమిం చుచున్నాఁడను.

«శ్లో॥ చకాశే పనసప్రాయైః పురీ షండమహాద్రుమైః»

అశ్లీలాదుల నాపాదించి చర్చించియున్నారు. ఇట్టివారు సంభోగశృంగారవర్ణనము నింద్యమేయగునెడల సహింతురా! గ్రామ్యాదిదోషములుకూడ నౌచిత్యముంబట్టి క్వాచిత్కముగా సమ్మతించియున్నారు.

«శ్లో॥ ఉత్తానోచ్ఛూనమండూకపాటితోదరసన్నిభే
క్లేదిని స్త్రీవ్రణే భ్రాంతి రకృమేః కస్య జాయతే»

ఇది జుగుప్సాకరమైనను శాంత్యుక్తియందు దోషముకాదని కావ్యానుశాసనాదులలో వ్రాకుచ్చియున్నారు. కొన్ని విదూషకోక్తులలో దుష్టములుకావని విడఁదీసియున్నారు, ఆయావిషయము నెత్తికొన్నచో నిప్పుడు తుదముట్టదు. మీవంటి ప్రాజ్ఞు లెఱుఁగనివిషయము నావంటి కించిజ్జ్ఞునకు సులభసాధ్యముకాదు.

«అనుక్తమన్యతో గ్రాహ్యమ్»

తెలిసిన సారమిది. నేఁటినవనాగరికులశంకలు పిచ్చిశంకలు. కొందఱు లేనిపోని రోషమునుగల్పించికొని తర్కాదిపానమును మానుకొనుచున్నవారు కలరు. అట్టివారును నని యెఱుఁగునది. వీరిని మనము సంస్కృతవిద్యాభ్యాసమునకుఁ గొనిపోవలసియున్నది. వారే తదనంతరమున దీని మంచిచెడ్డలు గుఱింపఁగలుగుదురు.

«గోకులాష్టమికి తురకసాహేబు నడుగుట యుక్తముకాదు.»

మఱియుఁ గావ్యనాటకాది పఠనము నిర్భరమును నిరతిశయమును నిర్ద్వంద్వమును నగు బ్రహ్మానందము ననుభవించుటకే పుట్టినదికాని కేవల చరిత్రమాత్రవిజ్ఞానమునకుఁ గలుగలేదు. తత్తద్వర్ణనలు మానుకొన్నచో నది కావ్యమేకానేరదు. వలసినచో గుహ్యద్వయవయవములనుగూడ వర్ణించుటకుఁ గ్వాచిత్కముగ సమ్మతించియే యున్నారు. కాని నైఘంటికపదములచే వర్ణించినచో నశ్లీలాదులలోఁ జేర్చియున్నారు. మోహనాలయాది పదములచే వాడుట తప్పుగాదని రఘువంశాదు లుద్ఘోషించుచున్నవి. వ్యంగ్యమునకు లక్షణము చెప్పుచు.

«కామినీకుచకలశవచ్చమత్కారకారిత్వమ్»

అని లక్షణవేత్తలు నిర్వచించిరనుచో సహృదయులకు సర్వమును విస్పష్టమే యగునుగాన విస్తరింపక యింతతో ముగించుచున్నారము.

(చతుర్థాంధ్ర మహాజనసభ, కాకినాడ.)

శ్లో॥ వందేమాతర మార్యచుంబితపదా మాసేతుశీతాచల
ప్రఖ్యాతాం కమనీయశైలవిపిన స్వాదూదకప్రహోదినీం
నైకస్వాదిమపూరపూరితఫలద్రుమైరుత్సమేతోర్వరాం
నానాభాషిత భూషితాంచ విదుషీం వీరప్రసూ శేఖరాం. 1

సీ. అభ్రచుంబితశిరోదభ్రంబులగు పూర్వ
పశ్చిమోత్తరగిరిప్రతతిచేత
మధురనిర్మలపయఃప్రథితంబులౌచు సం
తతముగఁ బ్రవహించునదులచేత
తరులతాగుల్మకందవనౌషధీనిదా
నములచేఁ దగు కాననములచేత
సంపూర్ణసర్వసస్యప్రశస్యములైన
కమనీయభూమిభాగములచేత
గీ. నుప్పొంగి దొమ్మిదింటికిం గొకప్రదేశ
మునకుఁ గోకుండ సంసారమును భరించి
శూరులును పండితులునగు సుతులఁ గన్న
తల్లులకు తల్లి! భరతమాతకు జయంబు. 2

సీ. చాళుక్యభూపాల సర్వతోముఖరాజ్య
పరిపాలనంబున గరిమవడసి
కాకతీయనరేంద్రకలితసింహాసన
శాసనంబున సుప్రశస్తిఁ గాంచి

ఆర్వీటివంశజాంగోర్వీశ్వరప్రాభ
వమున నిస్తులితవైభవముఁ బొంది
విజయనగరరాజ్యవిక్రమసాహచ
ర్యంబుచే విఖ్యాతి నగ్గలించి.

గీ. రెడ్డిరాజులచేత కీర్తినివహించి
వెలమ సంస్థానములచేత వినుతికెక్కి
నేఁటి కాంగ్లేయ సామ్రాజ్యపాటవమున
ప్రబలు మన యాంధ్రమాతకు వందనములు. 3

సీ. గోదావరీనదీపాదోదకమ్ముఁ ద్రావి
ఫలియించు కేదారవసతివలన
కృష్ణానదీమహోదాత్తసృష్టినిగ్రహయో
గముచే ఫలించుభూగర్భమువలన
తుంగభద్రానదీస్రోతోయంబు సస్యసం
పూర్ణముగఁ గావించుపుడమివలన
పెన్నాతరంగిణీసన్నుతాంబులనీర
సాంద్ర ఘనపూర్ణ నేలవలన.

గీ. మఱియు ఋషికుల్య మొదలైనఝరులవలన
తనుజులను కష్టపడి పెంపుఁగొనుచు నాత్మ
గౌరవముతోడ తనసంతానమునకుఁ
దనరు మాయాంధ్రమాతకుఁ బ్రణతిశతము. 4

సీ. రాజరాజనరేంద్రుతేజోవిభూతితో
నెయ్యంబుగన్న నన్నయ్యవలన
మనుమసిద్ధినృపాలుమహనీయకీర్తిచే
మహిమఁగన్నతిక్కనవలన

ఘనవేమభూపాలు ఘనయశోలక్ష్మికిఁ
బట్టైన శ్రీనాథభట్టువలన
కృష్ణరాయనికీర్తి కిరవులై పేరుజెం
దినఘనుల్ పెద్దనాదికులవలన

గీ. మఱియు సోమన పోతన మారనాది
కవులవలనఁ గవిప్రసూఖ్యాతిఁ గాంచి
యాంధ్రభాషాప్రపంచ మేమఱక నేటి
దనుక నిలిపిన యాంధ్రమాతను జూడుఁడు. 5

సీ. మన భాష శోభిసే మనతల్లికి సమగ్ర
విభవు లేకుండఁ గాంచింపవలయు
మనయింటిపెత్తనం బొనరించుచును మఱి
యమ్మయే మనలఁ గాపాడవలయు
మనమండలంబున మనతల్లి వేఱన
సిరిఁగాఁగ గృహముఁ గల్పింపవలయు
మనసహోదరులు సామంజస్యమున నేర్పు
చదువులే మనమెల్ల చదువవలయు

గీ. మనసు గాపాడఁదగు ప్రయత్నములెల్ల
ఎలభముగ నేరిగా మన సోదరులకు
మాతృభాషను వార్త బఱపఁగవలయు
నాంధ్రదేశీయులార మా యన్నలార. 6

సీ. ఆంగ్లేయసామ్రాజ్య మధిపతి స్వాతంత్ర్య
మునొసంగ మనకిది మొదటిమెట్టు
మన మెల్ల నైక్యసంపద మీఱఁ గావించు
మనపురోవృద్ధికి నునికిపట్టు

మనభాష యభివృద్ధి ఘనతయు సర్వశా
స్త్రపరిపూర్తి వహింప రచ్చపట్టు
మాతృసేవ త్యజించి మన మన్యసేవకై
దాటిపోనీయని త్రాళ్ళకట్టు
గీ. మొనయుసంఘదురాచారములను నెట్టు
రాజభక్తిని గూల్పని రాతిగట్టు
స్వీయగౌరవ మఱికట్టు చెంపపెట్టు
మానకుం డాంధ్రజనులార మనలపట్టు. 7

సీ. విభజించియును బ్రజాభిప్రాయమును బట్టి
వంగదేశము గలుపంగ లేదె
కోరినమాత్ర బేహారురాష్ట్రంబది
ప్రత్యేకముగఁ జేయఁ బడఁగ లేదె
శాసనసభకుఁ బ్రజాప్రతినిధులను
నెన్నుకో నధికార మీయలేదె
అనుమతింపఁగ లేదె హైందవంబగు విశ్వ
విద్యాలయంబు స్థాపించుటకును
గీ. కోరికలు కోరినంత చేకూరలేదు
మాకటంచుఁ బ్రయత్నంబు మానరాదు
పట్టుదలమానకుం డాంధ్రభట్టులార
తెగువఁ జూపిపుడీ తెల్గుదిట్టలార. 8

సీ. మనపురోవృద్ధి సాధనములాలోచించు
సభలిట్టులే యేట జరుగుఁగాత
మొలకలెత్తిన తెల్గు 'మూమెంటు' మనపెద్ద
యన్నల కభివృద్ధి యగును గాత

ఆబాలగోపాల మాంధ్రు లందఱు రాష్ట్ర
విభజన కేకీభవింత్రుగాత
సామ్రాజ్యశాసనసభలోన నీరీతి
తీర్మాన మొక్కటి తెత్రుగాత

గీ. భాషలంబట్టి రాష్ట్రవిభాగ మొకటి
మొదటఁ గావించుదురుగాత పిదప నిండి
యాను నాస్త్రిలియాఖోలునట్టిదాని
నొనరుతురుగాత మన దొరతనమువారు. 9

---

(ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ.)

గీ. చెన్నపురమునఁ గాఁపుర మున్నయట్టి,
యాంధ్రపరిషత్తునకు శుభప్రాప్తిరస్తు
ఆంధ్రభాషకు వాదంబు లాడుచున్న
యుభయపక్షంబులకు నైక్య మొదవుఁగాక.

సీ. ఆంగ్లేయభాషాంగనానుకూల్యంబున
, సరిలేని సాహిత్యగరిమ నడసి
దేవభాషాంగనాసేవనాబలమునఁ
దులలేని సౌభాగ్యకలనఁ గాంచి
నన్నయాదులు కవినాథు లేర్పఱచిన
మొనలేని మార్గంబు ననుసరించి
ప్రతివేశినుల నన్యపరిషత్కులస్త్రీల
ప్రతిలేని యాచారపటిమఁ గాంచి

గీ. ముద్దుబిడ్డలు మాటాడుసుద్దులెల్లఁ
జక్కపఱచుచు నభివృద్ధి కెక్కుఁగాక

నాంధ్రసాహిత్యపరిషదధ్యక్షతాక్షి
సద్యశ్శోభకక్క దిక్కులఁ జాటుకొనుచు.

సీ. దాతృత్వమందు రాధాతనూజాతున
కవల నేఁడాకు లెక్కువ పఠించె
నపరిమితాదృష్టమందు సుదర్శన
ధరణిజానిని దలదన్ని మించె
శీల్యంబునంద సౌశీల్యాదిగుణముల
ధర్మరాజును దలదాఁటి మించెఁ
జిన్నతనంబునం దన్నిదిగంతంబు
లును తనకీర్తికామినికిఁ జూపె

గీ. నాంధ్రభాషను బోషించె నట్టిఘనుఁడు
రావుకులమణి శ్రీసూర్యరాయనృపతి
నేఁటియగ్రాసనాధిపుం డౌట మాడ
నాంధ్రపరిషత్తు చేయుపుణ్యంబు గాదె.

సీ. ఇంగ్లీషుభాషలో ఎం. ఏ. బి. ఎల్. దాఁక
ప్యాసుచేసిన మహాపండితుండు
సంస్కృతాంధ్రంబుల శతఘంటకవనంబు
పచరించినట్టి విద్వత్ప్రభుండు
ఆనందదంతీశ్వరాఖ్యరాజాఖ్యుండ
లుస కెంతయును బ్రీతి మనినమేటి
విజయపురీమహారాణవిద్యామహాశాల ప్రి
న్సిపల్ పదవి గాంచినఘనుండు

గీ. ధరఁ గిలంబ్యన్నవాయపుధామకీచి
యనఁగ నొప్పారు రామానుజార్యమౌళి

నేఁటియగ్రాసనాధిపుం డౌట చూడ
నాంధ్రపరిషత్తు సేయు భాగ్యంబు గాదె.

---

(ఆంధ్ర సాహిత్య పరిషత్తు, రాజమండ్రి)

మ. స్మయమానాంధ్రమయప్రసిద్ధకవితాసామ్రాజ్యపట్టంబు న
న్నయ కర్పించిన నీపయఃప్రస్రుతి కీనాఁ డాంధ్రసాహిత్యవా
ఙ్మయవల్లీతతి నాంధ్రలోకహృదయావాలస్థితిం బెంచి భ
వ్యయశోభూతులు గూర్చు టొక్కవిషయంబా? తల్లి ! గోదావరీ. ౧

సీ. చినిఁగిపోయిన ప్రాఁతచీర కట్టక పట్టు
కోక లేటికి కటంచు గొణఁగువారు
ముసుఁగువేసి విభూతి నొసటిపైఁ బూయక
సింగార మేలంచుఁ జెప్పువారు
ఇష్టమైనట్లు లూరేఁగింప కేటికి
పదసౌష్ఠవం బంచుఁ బలుకువారు
పడిసువర్ణములు సంపాదింపఁ జాలక
కై సేఁతలే లంచుఁ గనలువారు

తే. గీ. నీమతము నీస్వరూపంబు నీనియమము
పాడుసేయక యుండఁ గాపాడుఁగాత
మాంధ్రసాహిత్యపరిషద మహరహంబు
సరసగుణపేటి ! యాంధ్రభాషావధూటి ! ౨

సీ. అష్టభాషలకు వాగనుశాసనుండైన
నన్నయ్యకవి పెంచినాఁడు మున్ను
ప్రేమానుబంధమ్ముతో ముద్దుముచ్చటల్
తిక్కన్నకవి మున్ను తీర్చినాఁడు

పసువుగాఁ బల్లకీపై సర్వదేశముల్
శ్రీనాథకవి మున్ను ద్రిప్పినాఁడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్
పెద్దన్నకవి మున్ను పెట్టినాఁడు
తే. గీ. అట్టికవితావధూటి కోయార్యులార!
యిచ్చవచ్చినయట్లు మీరువచ్చినట్లు
నగలు నానోమ్ములును బెట్టఁదగును గాని
సూత్రములు ద్రెంపకుం డాంధ్రసూరులార! 3

---

## —♦ భక్తి ♦—

### (శ్రీ సత్యనారాయణస్వామి.)

సీ. ఇనుగంటిరామరాయనికొండయందు స్వ
యంవ్యక్త మయ్యె నేయనఘమూర్తి
తాఁజనించినచాది తత్పర్వతమునకు
రత్నగిర్యాఖ్య నేర్పఱచె నెవఁడు
అన్యసంసేవనం బాగీకరింపక
యినుగంటికులులఁ గైకొనిమె నెవఁడు
ఎన్నివిఘ్నము లాఁగ నున్న నవ్వాని నొం
టరి సేవకులచేత నణిమె నెవఁడు.
తే. గీ. తనదుభక్తుని నినుగంటికునకులీను
సుప్రకాశుఁ బ్రకాశుఁ బ్రోచుత మతండు
ఇంతకన్నను విభవమ్ము లెసక మెసఁగ
సత్యనారాయణస్వామి నిత్య మోమి. ౧

ఉ. ఎన్నియొ యుత్సవమ్ములు మహిం గల వయ్యెడ కేగువార లా
ఘన్నతి గాంచుటల్ గల దబద్ధము గాదిట నట్టిపీఠ మే
మెన్నఁడుఁగాని మందునకు నేనియుఁ గన్నది లే దొకప్పుడున్
విన్నది లేద యీమహిమ వే ఱిటువంటిశరణ్యు లుండిరే? 2

సీ. ఇనుగంటివంశపావను లైనరాజుల
ప్రాభవంబునఁ బ్రోవఁబడినవారు
సత్యనారాయణస్వామి కళ్యాణోత్స
వంబుల కై సాయపడెడువారు
బ్రాహ్మణభక్తి దైవప్రపత్తియు గల
వినయంపుఁగలిమిచే వెలయువారు
బండిమీఁద నిలఁబడి పూచి జెబ్బులినైన
నడిదంపుఁజోఁటుచేఁ బొడుచువారు

తే. గీ. అన్నవరమునఁ గాఁపురం బున్నవారు
నేఁటికిని బూర్వపద్ధతి నిలుచువారు
పరమభక్తులు నైన యొంటరులనెల్ల
సత్యనారాయణస్వామి సాఁకుఁగాక. 3

సీ. పదియాఱువేలగోపస్త్రీలపాలిండ్ల
నిల్లటం బుండిన యెమ్మెకాఁడు
పంపానదీతీర శాలపుష్పారామ
మాకంద లలిత పుంస్కోకిలంబు
మూఁడుకన్నులవేల్పు మొదలైన జేజేల
కెల్ల నీడ నొసంగు నల్లమబ్బు
సూర్యప్రకాశభాసురచిత్తనీరజం
బిల్లుగా నెపుడు వర్తిల్లుబాల

తే. గీ. అన్నవరమునఁ గాఁపురం బున్న గేస్తు
రమ్యగుణుఁ డైన సత్యనారాయణుండు
మమ్ము మాప్రభువర్యుని మమతఁ జూపి
ప్రోచుఁగావుత మెపుడు ప్రభూతకరుణ. ౪

---

## దశావతారము.

ఉ. త్రుచ్చిలి వేదముల్ జలధి మున్గినరక్కసు నుక్కడంపఁగా
మచ్ఛమవై మహాజలధిమధ్యమునన్ జొరఁబాఱి యచ్చటన్
గ్రచ్చఱ వానిఁ జంపి యలకాంచనగర్భున కాగమంబు లం
దిచ్చిన నీచరిత్ర కివియే పదివేలనమస్కృతుల్ హరీ. ౧

చ॥ జలనిధి పేరి హీరకలశంబున మంధరభూధరంబు పే
ర్గలయులకవ్వముల్ జొనిపి త్రాడుగ సర్పవిభుల్ బొనర్చి దై
త్యులు సురలున్ మథించుతఱిఁ దోడన మంధర మప్పయోధిలో
పల మునుఁగంగఁ గూర్మము యి పైకెగనెత్తినదేవు నెంచెదన్. ౨

చ. తపమునఁ బద్మసూతికి ముదం బొనరించి వరంబుగాంచి దే
వపతి నదల్చి దేవతల బాధలుపెట్టుచు హేమనేత్రుఁ డి
ట్టిపనులచేత భూమికి ఘటించెడియాపదఁ బాపనెంచి యా
రిపుని కిటీంద్రమై త్రుటి హరించినదేవు హరిన్ దలంచెదన్. ౩

చ. కొడుకు హరీ! హరీ! యనుచుఁ గోవిదమాన్యుఁడు సంస్మరింపఁగా
దుడుకుతనం బటంచుఁ బగతోఁ గొమరున్ గను గోదు వెట్టునా
చెడుగును రూపుమాప నరసింహమవై యుకుకంబమందునన్
బొడమిన సర్వలోకజనపూజ్యచరిత్రుఁ దలంతు నిన్ హరీ. ౪

క. కడుఁజిన్నివడుగవై మూఁ
డడుగులు పుడమిని బలీంద్రు యాచించిన యా

గడుసుందనంబు భక్తుల
యడుసుందనమున్ హరింప నగుఁగాక హరీ. ౫

చ. ఇరువదియొక్కమారులు ధరణీంద్రుల నుక్కడఁగించి రక్తసా
గర మొనరించి యందుఁ బితృకర్మ మొనర్చి మహానుభావుఁడై
పరశువు మూఁపునుండి యిలపై నిడి శాంతమనస్కుఁడై శివం
కరముదపం బొనర్చినజగన్నుతు రాముని సంస్మరించెదన్. ౬

చ. జనకునియానతిన్ గహనసద్మములన్ బదునాలుగేండ్లు దే
వన మొనరించి యయ్యెడ నపాత్రుఁడు రావణరాక్షసుండు భా
ర్యను హరియింపఁ గోఁతులదొరన్ జెలిగాఁగొని వానిసేనప్రా
పున దనుజేంద్రుఁ గూల్చి యశముం గయికొన్న నిను న్నుతించెదన్.

ఉ. ఘాతుకుఁ దల్లిదండ్రులను గాఱియవెట్టిన యుగ్రసేనజున్
మాతులుఁ గంసునిన్ గెడపి మధ్యమపార్థుని చిత్తశుద్ధికై
గీతలుసెప్పి కౌరవుల గీటడఁగించినవాసుదేవు వి
ఖ్యాతుని సంస్మరించెద మహాత్మునిఁ గృష్ణుని వీతతృష్ణునిన్. ౮

తే. గీ. బుద్ధరూపంబుచేతఁ బ్రబుద్ధుఁడవయి
జనులఁ దత్కాలదుర్మత శ్రవణమనన
దుష్టులను శిష్టుల నొనర్చి పుష్టి జగతి
గొసఁగు నీకు నమస్కార మోమహాత్మ! ౯

తే. గీ. దుష్టజనతాప్రభూతమై శిష్టరహిత
మై యధర్మభూయిష్ఠమ్ము నైనధరణిఁ
గలి హరించి ప్రోచుటకునై కలికిమూర్తి
వగుదువఁట! దేవదేవ! నీకగుత జయము. ౧౦

---

*

(శ్రీసర్పవరపు భావనారాయణస్వామి.)

సీ. ఇందిరాసుందరీమందిరాంతఃపురా
                 ళిందచారిమిళిందనందనములు
భక్తమానసవియత్ప్రదేశనిరాయాస
                 సంచారభాస్కరస్యందనములు
అమరలోకాధిపప్రముఖపాళికిరీట
                 కురువిందమాణిక్యకుందనములు
ఏకహారప్రసారాకులీక్రియమాణ
                 రక్షఃకులాంగనాక్రందనములు

తే. గీ. నీకటాక్షమ్ము లోకకొన్ని నెఱపుమయ్య?
        కలితతులితేశ్వరత్వసంక్రందనములు
        భావనారాయణస్వామి పరమపురుష !
        భక్తరక్షణ నీ కివే వందనములు. ౧

సీ. శ్రీవైష్ణవులు ప్రక్క సేవకై గుమిగూడ,
                 గాయకుల్ సంగీతకములు పాడ
విప్రోత్తములు వెన్క వేదముల్ పఠియింప
                 నర్తనాంగనలు ముందఱ నటింప
వైవర్ణికులు బిట్టువాద్యముల్ వాయింపఁ
                 జూచువారల కెల్లఁ జూడ్కి నింపఁ
బ్రతియింట మంగళారాత్రికల్ గ్రహియింపఁ
                 జందనగంధములు సంచరింప

తే. గీ. గరుడవాహన మెక్కి శ్రీవరవరముని
        తోడ శ్రీదేవితోడను గూడి నేఁడు

భాననారాయణస్వామి బయలుదేరె
సర్పపురమున ముక్కోటిసమయమందు. ౨

సీ. జోహారు దుష్టరక్షోరాజశిక్షణ
దక్షచారుతరప్రతాప! నీకు
దండంబు భక్తవత్సలకటాక్షవిలాస
జాలపాలితజగజ్జాల! నీకు
వందనంబు దిగంతపాలమౌళికిరీట
పీడితమణిపాదపీఠ! నీకు
మ్రొక్కులు దేవతాపూజనీయాధిక
ప్రీయమాణవలచ్చరిత్ర! నీకు
తే. గీ. శరణు సంసారిరాఘవాచార్యహృదయ
పంకజాతనివాసనిష్పంద! నీకు
గరుడవాహన మెక్కి నిగ్రామమేగు
చుండుదేవుండ! నారాయణుండ! నీకు. 3

---

నా రా య ణ దా సు.

తే. గీ. ఎన్నియో వత్సరములాయె నేను నిన్నుఁ
గాంచి నారాయణుండ? నీకథను వినియు
మా ప్రకాశరాయనుని కుమారి పెండ్లి
కారణమ్మున నినుఁ జూడఁ గల్గె నేఁడు. ౧

చ. కడియము వచ్చితంట? ననుఁ గాంచెడిపూనికతోడ, నాఁడు మా
బుడుతని నడ్గితంట! పోలమూర్ జనె నంచువదించెనంట! వెం
బడిగ 'మోటారు' నెక్కి మునువచ్చినత్రోవనె యేగితంట? మి
త్రుఁడ? యలరాజరాట్సురికిఁ దొందరపాటిటు సేయ నాయమే. ౨

క. తొందరపాటునసకుఁ ఫల
మందితి మావిభునిచేత నానీతుఁడవై
యుందఱిలో నేదెప్పఁగ
సందిచ్చితి వౌర? యెంతచతురుఁడ వోక్కో? 3

---

గానము.

సీ. సంజీవరాయనిసంగీత మెచ్చన్న
నాగరత్నము నేమనఁగవచ్చు ?
నాగరత్నముపాట నాణెం బటందుమా ?
కోటయ్య కేమాట గూర్పనొప్పు?
కోటయ్యపాటయే గొప్పదటందుమా?
సంగన్న నేమి యనంగ నగును?
సంగన్నపాటయే సరసం బటందుమా?
కలుగునేమో? వేఱొకండు ఘనుఁడు
తే. గీ. అదియునుంగాక గానరసాబ్ధి మునిఁగి
తేలలే కట్టులో తేలి యోలి మరల
మున్గి మఱితేలి మఱిమున్గి మొనసి తేలఁ
జాల కున్నట్టిసభ కేమి శక్తి గలదు. ౧

క. సంగన్న యనుట కన్నను
సంగీతన్న యనఁ గొంతసంగతమౌ నీ
సంగన్నశాస్త్రిగారి న
నంగా వాయించి తపరనారదమౌనీ? ౨

---

ఉ. మ్రింగునొ లేక ముక్కుఁగొని మిక్కిలి నొక్కునొ? లేక మీఁదికిన్
జెంగున దాఁటునో? యనఁ గుచేష్ట లొనర్చెడివారి పాటలే

రంగుగ నుండుచో వినఁ గరంబుఁ గుతూహల మబ్బు రామసు
బ్బాంగజు పాట శ్రోత్రముల కక్షులకున్ ముద మూరఁ జేయదే? ౧

క. తెగఁ బాడినపైఁ బాడెడి
వగమొగ్గికలును ననంగు వగలఁ బొగులుపై
నాగిలిన మగువల కళలును
సాగించున్ రామసుబ్బసూరి వరేణ్యా. ౨

---

శా. కాంతస్వాంగతి జంత్రము న్నపుడున్ గాంతమ్ముగాఁ బాడుటన్
గాంతప్రక్రియఁ గీర్తనల్ నుడువుటన్ గాంతాస్వనం బూనుటన్
'గాంతయ్యా' యని యూతనిం బిలుతురో? కాకంతయున్ మున్న వా
కాంతుం డారయఁగాన నీతని కిటుల్ గల్పించెనో? నామమున్ ౧

---

ఉ. పాడినపాట యంతయును బ్రాణదమై తనరారినప్పుడే,
సూడిదగా సుదృక్తతిని జొక్కఁగఁ జేసెడిఁగాక గానమే
జాడనొ యెట్టులో యొకటి చక్కఁగ నుండిన నేమి? యంతయున్
గాడిదగ త్తరైన నది గానమె? గాయకుఁ డౌనె? యూతఁడున్. ౧

క. తన కెదుట నున్నవారల
ననయముఁ దలలూఁపఁ జేయునాతఁడు దాగా
యనుఁ డౌనుగాక మాటికిఁ
దనతలఁ దాఁ ద్రిప్పికొనునతఁడు గాయనుఁడే? ౨

క. మునిసాములనఁగ నెందును
ననురాగము నందువారలా? నీగాన
మ్మునయందు వెఱ్ఱిమోహము
గను నీమునిసామి యెట్టిగానమ్మొకదా? 3

ఉ. బాదరుఁ డన్న కారణముఁ బట్టి వచించుటగాదు నిక్కమీ
చందపుగాత్రముల్ మృదుళశైలియు నైపుణి గూడఁ గూడుటల్
వాదలవేల మున్నటను బహ్వారి లక్షలఁ గల్గు నేమొకో?
సందియ, మెంతయేనియును జక్కఁగఁ బాడితివయ్య! లక్ష్మణా? ౪

---

ఉ. గానమునన్ గవిత్వమున గాయనగాయనులన్ గవీంద్రులన్
ధ్యానమునన్ జపమ్మున మహాత్ములచిత్తములందు వెన్నెలన్
జ్ఞానమునందు మానమునఁ గల్గినశక్తి నెవం డెఱుంగు వి
ద్యానిధులైనవార లెవరైనను వంద్యులు వంద్యులెమ్మెయిన్ ౧

క. ధనకోటిపాట కేమి
చ్చిన ఋణముల్ దీఱఁగోదు చెప్పవలయు యు
క్తిని నొక్కఁ డీచట నయ్యా
ఖ్యానె యిటునటు చేసి యొసఁగ గౌరవము గదా? ౨

తే. గీ. తిత్తి మన్నింపఁ బడదొక్కొ? దేవదారు
కట్టెకును లేదె మిక్కిలి గౌరవంబు
గుట్టపున్ వెద్రుకల కెంతగొప్పలేదు
విద్య గలవస్తువుల కెంచు నెలియుఁ గలదె. 3

మ. భువిలో విద్య లనంగ నెట్టివియొ? సంపూజ్యత్వ మవ్వానిలోఁ
గవు లెద్దానికి ముందొసంగ వలెనో? కాకన్నియున్ విద్దెంగో?
చవి యెద్దానికి నిర్వివాద్యమొ? యశస్సంపత్ప్రదం బేదియో?
యువతీగానము లెట్టివో? తెలిసె నోహో! నేటికిన్ గోటిరో. ౪

క. ధనకోటికి ధనమిచ్చుట
మనవిమొ? యది యెట్టులుండ మన మందఱముల్
ఘనతయు వినుతియు నిత్తుము
ధనకోటికి నొక్క లెక్క? ధనముల్ గినముల్. ౫

తే. గీ. మోహినీ వేషధారియౌ శ్రీహరిం గని
మోహవార్నిధిలో మున్గు రాహు లేయు
జనకు ననిమిత్తమగు కృపాధనము వలన
మోహినీగానసభ వృద్ధిఁ బొందుఁ గాక. ౬.

---

ఉత్పలమాలిక.

ఉ. 'కోటయగారు గానమున గొప్పవహించి' రటన్న యట్టి యీ
మాటకుఁ గోపమంది యొక మానవుఁడు నన్నుఁ దెగడుచున్ నిరా
ఘాటత నిన్నియో గొణఁగెఁ, గాని యదేమి పురాకృతంబొ? యీ
పాటకు నామనమ్మున ససారముదంబు జనించినట్టు ల
ప్పాటకుపాటకున్ గలుగు పద్ధతి నొప్పడ జేమి సేతు? నీ
కేటికి గానపున్ విషయ మించుక యేని యెఱుంగ వూరకే
మాటికిమాటికిన్ దెలియుమానిసిపోలె నటింతు వందురా?
నోటికి బుద్ధిచెప్పికొన నూఱువిధాల యతించినన్ నిరా
ఘాటతఁ బూని వాగుటకుఁగాఁ బ్రయతించిన నేమి సేతు? నే
మాటల కేని యోర్చి తనమానసమందలి యూహ తెల్పకే
బూటక మాడ నోరువని పూరుషు లక్షణ మయ్యె నేని "యీ
కోటయగారు గానమునకున్ మన బాదరునంద మేటి" యం
టేటికి హెచ్చరున్? జగతి నెల్లెడఁ బేరువహించు యోగ్యుఁ డీ
మాటకుఁ జాలఁడే? యకట? మానవప్రపంచములోన సత్యపు
మాటకుఁగూడ నెట్టి యవమానము వచ్చుచునున్న దద్దిరే! ౧

---

చ. కనకయశాస్త్రి! నీ దయిన గాత్రము సర్వవిధాల మిక్కిలిన్
వినుతికిఁ బాత్ర, మెంతయు గభీరము మేసురవోపమాంబు నిక్కౌ
వినుటకు నేఁడు చూచుటకు నీసము భేదము గానఁ జోటు గా
యనకశిరోవిభూషణము నైతివి నీ సుకృతంబు స్వల్పమే? ౧

తే. గీ. గాత్రముండిన జ్ఞానంబు గలుగఁబోదు
జ్ఞానముండిన గాత్రంబు గలుగఁబోదు
రెండుగల్గినవాఁ డొక్కఁడుండు నూట
నాఁట, వారలలోఁ గడు మేటి వీవు 2

ఉ. మోము వికారచేష్టలకుఁ బో గమకింపదు, గొంతుకుస్వరా
ఖ్యామయదోషముం గొనదు, హస్తము శస్త్రము లంతినాంద్యమం
దేయుట లోటు నీకు? స్వరమేగెడిపట్టునఁ బర్వతాగ్రపున్
భూములనుండి క్రిందఁ బడఁబోవు ఝరంబు భరంబుఁ జూపెడిన్. 3

---

—: కవులు. :—

(రవీంద్రనాథఠాకూరు.)

శ్లో. సర్వద్వీపవతంసచారుకవితామల్లీప్రసూనస్రజే
వాగీశాయ రవీంద్రనాథకవయే కుర్మ శ్శుభాశంసనం
హేలానిర్మితయాఽపి కావ్యసుధయా భాషాంతరీభూతయాఽ
ప్యామోదం వితనోతి య స్సుమనసాం సర్వప్రపంచేఽధునా. 1

శ్లో. ఠాకూరువంశాంబుధిపూర్ణచంద్రో
దేవేంద్రనాథస్య సుతో మహర్షేః
బంగాళహూణామఖదేశభాషా
నిధిః పురోభాతి రవీంద్రనాథః 2

శ్లో. ఖండేఖండే నగర్యామపిచ జనపదే దేశభాషాస్వనూక్తం
పుణ్యా దేకాగ్రచిత్తాః పులకితవపుషో యస్య కావ్యం పఠంతి
వాగ్దేవీ యస్య వాచి క్షిపతి మధురుచిం శీతలాం భూతధాత్రీ
సర్వేషా మక్షియుగ్మం సపది వినుతా మాతిథేయం రవీంద్రః. 3

సీ. అఖిలదేశసముచ్చయం బైనబహుమతిఁ
గణియించె నేసూరికౌశలంబు
రసవత్కథానకప్రసరణావిఖ్యాతి
కల్పించె నేకవికల్పనంబు
భరతఖండము కవిప్రభుజన్మఖని యన్న
ఖ్యాతి స్థాపించె నేఘనుని పేరు
సర్వవిద్యాగారచత్వరమ్ములయందుఁ
దాండవం బాడె నేధన్యుకీర్తి

తే. గీ. సుకవితాశక్తి నట్టిభాసురగుణుండ
వరుగుదెంచితివయ్య మాపురికిఁ గాకి
నాడ కీనాఁటికి రవీంద్రనాథ సుకవి
సార్వభౌమ! యిదే నీకు స్వాగతంబు. ౪

సీ. వంగరాష్ట్రము గర్వపడునట్లు మహర్షి
దేవేంద్రనాథుఁ బుత్రీకరించె
భారతీయులు తుష్టిపడఁగ "నోబిలు ప్రైజు"
గైకొనె సరసమరాకవనమందు
సర్వానుభవనీయసంగతుల్ చొనుపుచు
వర్ణించెఁ బెక్కుకావ్యములు జగతి
నన్యఖండముల బ్రహ్మైక్యమ్ము వివరించు
గీతాంజలి రచించి కీర్తివడసె

తే. గీ. జ్ఞానమునయందెకాక యైశ్వర్యమందు
సైతము రహించె భాగ్యవిస్ఫీతి మెఱయ
నవసుధామూర్తికి రవీంద్రనాథుకీర్తి
కభ్యుదయ మబ్బుఁగాత నిరంతరంబు. ౫

(ఒక కవయిత్రి.)

మ. జనసంబంధితి సత్కవీట్కులయుతన్ సత్సేన కావించి పెం
చినకైతన్ బరమాత్మసాత్కృతిగ వాసిన్ సర్వమర్పించి స
జ్జనమాన్యత్వము గాంచి శాశ్వతయశస్సంతాన మార్జించితో
కనకాంబా? సతులందు నీ కుసమ లోకంబుదు లేదెందులన్. ౧

శా. కాశీనాథునివంశదీపకుఁ డనంగా నెందుఁ బెంపొందు నా
గేశుం డేనును శ్రీపదాన్వయుఁడు శ్రీకృష్ణుండు లోనౌ సుధీ
వైశంపాయనులట్లు నీమకవితన్ వర్ణించి నాఁడిచ్చునా
యాశీర్వాదము చాలదే? సుకృతి బ్రహ్మానందమున్ జెందఁగన్. ౨

క. ఉవిదకుఁ దిలకముకన్నన్
బ్రవిమలభూషణము లేదు ప్రారబ్ధమునన్
దవులదది నీకుఁ గోస్తు,
కవితిలకమవైతి లోటు గనుపడ దింకన్. 3

—: నానాసందర్భములు. :—

(కాకినాడ మ్యునిసిపలు సంఘము.)

సీ. అనుకూలసభ్యుల నరసి నేమించుటోఁ
గల్గిన పౌరసంఘంబు గల్గి
ప్రజలమాటలఁ బట్టి పట్టణసౌభాగ్య
మొనగూర్చు మంచిసభ్యులును గల్గి
పట్టణం బభివృద్ధిపఱచుచుఁ బరిశుద్ధి
సల్పెడి యుద్యోగిజనులు గలిగి
సకలకార్యమ్ములు సవరించుటోఁగల
మేటియైనట్టిచైర్మను గలిగి

తే. గీ. అన్నిపట్టణములకంటె మిన్నవగుచుఁ
కీర్తినడయుచు సుజనైకగేయమైన
గౌరవమ్మున కెక్కెనే కాకినాఁడ
మ్యునిసిపల్ సంఘమా? వృద్ధిఁబొందుమమ్మ? ౧

సీ. ఓటర్ల భయపెట్టి చాటులంచములిచ్చి
సభ్యతాపదవి కాసపడువారు
అధికారులగువారి యాశ్రయబలమున
"మెంబరీషిప్పు" కామించువారు
సభకు విగ్రహాపుష్టిసలుపుచు యజమానుఁ
డేదిచెప్పినఁ జేతులెత్తువారు
చదువుసందెలురాక పదిమందిలోఁ దలఁ
ద్రిప్పికోఁగోరి యత్నించువారు

తే. గీ. సభ్యతాపద మాసించు సమయమందు
దప్పఁ దమవీధిచూడని ధన్యతములు
నీకు మెంబర్లుకాకుండఁ గాకినాఁడ
మ్యునిసిపల్ సంఘమా? వృద్ధిసెనయుమమ్మ? ౨

---

(జర్మనీయుద్ధము.)

సీ. కదనప్రసంగంబు కలలోనిదగుటచేఁ
గనుమాటు చెందిన కత్తిపోటు
ప్రస్తుతావస్థకు బనికిరాకుంటచేఁ
గ్రాఁతగిల్లిన ధనుఃపాటవంబు
సౌఖ్యానురక్తి విస్తారమైయుంటచేఁ
గ్రాలుమాలిన మేటి బాహుబలము

అవసరం బిసుమంతయైన లేకుంటచే
మాయమైపోయిన మంత్రశక్తి
తే. గీ. మరల మనమెల్ల నొకసారి స్మరణసేయ
సమయ మేతెంచె నిప్పు డాజర్మనీల
దోర్మదం బడఁగింపఁ బమంపు వదుఁడు
రండు లెండయ్య? సంగ్రామరంగమునకు. ౧

---

(వినుకొండ.)

శా. ద్రవ్యాశన్ గొని కాని లోకమున సంస్తవ్యత్వసంపాదక
త్వావ్యామోహముచేతఁగాని యిటులేతాదృఙ్మహాధారణా
దివ్యాప్యంబవధానముల్ సలుప నేతేఁబోము ప్రాజ్ఞుల్ కవి
త్వవ్యుత్పన్నులు పిల్వనంప నిరసింతుర్ రామి నేతెంచుటల్. ౧
మ. అవధానమ్ములు మానుకొందమన మా కాయేఁటి కాయేఁడు చి
న్నవౌ లేకుండినఁ బెద్దవౌ యొనరుపన్ మాన్యుల్ కవిత్వాభిలి
ప్సువు లీరీతిగ శ్రద్ధసేయు నెడ నిష్టుల్ గామి మా కేల? యీ
వ్యవసాయమ్మును మాన మామరణ మో వాగ్దేవి! వీక్షింపుమా.
మ. సెలవమ్మా వినుకొండ! నీకిదె శుభాశీర్వాదపుంఁ దండ, ని
మ్మలబావి! భవదీయ నిర్మల పయోమాధుర్యముల్ క్రమ్మఱన్
గలుగుంగావుత మాకుఁ దావక శుభాకారాంఘ్రియుగ్మంబు నేఁ
దలఁదాల్తున్ దయయుంచు గుంటుహనుమద్దైవంబ! రామేశ్వరా. ౩

---

(ఒక ప్రశ్న.)

మ. కవితాశోచ్యులు మాననీయులనియున్ గవ్యగ్రణుల్ తాదృశో
క్తివిశేషమ్మును నోఁచికోరనియునున్ దెల్లమ్ముగావించు నీ

డు వివేకమ్మున కీపుర మ్మఖిలముఁ దుఃఖంబు చేయున్ దీని నే
సువివేకమ్మున మెచ్చఁ జేసెదవొ? యోసుబ్రాయ! వాక్రుచ్చుమా

మ. కవినా? నెట్టిఁడనో? కాకవిత్వకలనాకష్టుండునా? నెట్టిఁడనో?
కవియేమాన్యుఁడొ? కాకవిత్వకలనా కష్టుండె తా మాన్యుఁడో?
సువివేకుల్ గుఱితింపనేరుతురు శోచ్యుల్ నేరరీకర్మ, మీ
వా? పరీక్షించి వివేకి, వేటిభ్రమ నీకో సుబ్బరాయగురూ? యిటన్. ౨

శా. శాఖైక్యభ్రమఁ గల్పి మానసమునన్ జాడ్యంబు జన్మించి యా
లేఖన్ దాదృశరీతిగా వడపెనో? లే కన్యమేమున్నదో?
మౌఖర్యమ్మున మ్రోఁగు బాదర్పురిన్ మన్నించి వాక్రుచ్చు భూ
లేఖాగ్రేసర! సుబ్బరాయ! తెలియన్ లే నేను నీ భావమున్. 3

శా. నీ తేజం బభివర్ణనీయము కదా నీ తెల్వి మాన్యమ్ము నీ
చాతుర్యంబు కవీంద్రగణ్యము, యశస్సాంద్రమ్ము నీరీతి నీ
కేతాదృఙ్మతిభేద మెట్లొదవె? నెంతే మూఁటెడిన్ లోక మీ
పాతిత్యమ్మెటు దాఁటెదో? తెలుపు సుబ్బారాయ! నాతోడుతన్.

శా. ఆలేఖన్ గని బాదరట్టుడికి నట్లా బాలగోపాలమున్
"జాలున్ జాలునుఁబో?" యటంచు నెచట న్జాలన్నినున్ దూఱు నీ
శీలం బెట్టిది? తెల్వి యెట్టి? దకటా? చేతమ్ము తానెట్టి దా
యీలోప మ్మొనరింపఁ గారణ మదేమో? తెల్పు సుబ్రాణ్మణీ. ౫

శా. సామాన్యుండవుగా వుదారుఁడవు వాక్చాతుర్యధుర్యుండవున్
ధీమన్మౌళివిభూషణుండవు జగద్విఖ్యాత పాండిత్య వా
గ్జృంభముల్ మాన్యులుగాక కాకవులు నీకున్ మాన్యులైరి? నీ
యామోదం బది యెట్టిదో? తెలుపుమయ్యా? సుబ్బరాయాగ్రణీ.

శా. ఉండున్ గాక స్వశాఖగౌరవము లేదో కొంత? మహాపాండితీ
శౌండీర్యమ్మున నట్టి ప్రేమ లవలేశమ్మున్ గలా? దీని కా

క్రుంతున్ మెచ్చిన వాఁడు గన్పడఁడు నీ కార్పణ్య మిట్లెంతలో
బండారమ్మిది బైటవైచె నెటు సుబ్బారాయమాత్యాగ్రణీ. ౭

మ. జరిగెన్ జాలి పొరపాటు, దీని కెదియో శాంతిన్ వచింపంబనున్
బొరపాటేయిది గాక యున్న యెడ నిష్ఠో రేపు తద్ధేతుతా
స్ఫురణమ్మున్ వెలిఁబుచ్చి బందరుపురీశోకంబు నాఁగన్ దగున్
వ్యారలో నిందులకున్ గడంగఁదగు సుబ్బారాయ? వేయేటికిన్. ౮

శా. నా కాలేఖకతానఁ బొందగిన విన్నాణమ్ము లేశమ్మునున్
లేకున్న న్నిను శోచ్యుఁగా నొదవ్పు నాలీలల్ సహింపంగ రా
కేకాంతమ్మున నీకుఁ దెల్పితిని నీవేమేని ప్రత్యుక్తిచే
లోకమ్మున్ దనియించు పద్ధతుల నాలోచింపు సుబ్రాయఁడా? ౯

శా. శాఖాగౌరవమూని మొదలు యశస్సన్న్యాసమున్ గాంచిరో
మౌఖర్యమ్మున ప్రేమఁ గుత్తపురిసీమన్ గబ్బమున్ జూడు వి
ద్యాఖర్వుల్ కడుమాన్యులై సుకవితాధన్యుల్ తదన్యత్వధీ
రేఖన్ జేరిరె? సుబ్బరాయ? మొఱలీకీర్తిన్ లిఖింపించితో. ౧౦

శా. చాలున్ మూలములేని తప్పు కవితాసంసార మం దీఁదు టే
వాలాయమ్మును వృత్తిగా మెలఁగు కోప్రం బన్కటా? మాన్యమై
హేలాపాలితదిక్కటాహ కవితా హేవాకసంపద భవుల్
తూలమ్మౌనయెఁ గాకపోయి రెటు లీ దుఃఖమ్ము? సుబ్రాయ్మణీ. ౧౧

మ. ఎవనిన్ స్వప్నమునందుఁ గన్గొనిన నో నేవారి వాచాలతా
ద్యవివేకంబులు నొప్పుమాయునొకటా? యవ్వానమాన్యుల్ మహా
కవి నీకట్టెఁడు కాఁడ యే ఘనులు దుఃఖంబందరో దీనికిన్
సువివేకంబునఁ జేయుకే నొడువుమా! సుబ్రాయమాత్యాగ్రణీ. ౧౨

మ. అవధానంబ, బవధానమున్ దలఁచి యేయార్యాంశు రాఁజొప్పు వా
ర్త వినాగాఁ బడఁగాని పాఱఁ గల ధీరమ్మావ్యశా కావ్యుల్

కవితాలోకమునందు మాన్యులె? యటుల్ కాతర్యముంగూర్చు నా
కవివర్యుండట! యుకాఁడె? యెట్టులిది? చక్కఁగన్ దెల్పు సుబ్బాయఁడా?

శా. నీకే తోఁచెనొ? యెవ్వరే నొడివిరో? నీవంటి ప్రాజ్ఞాళియుల్
లోకంబుఁ దురపిల్లఁ జేయు నయశోలోలత్వపున్ మానికిన్
ప్రాఁకన్ గోరుదురే? యశేని జగతిన్ బ్రాజ్ఞత్వ మెంచుండునో
వాక్రుచ్చంగదవయ్య? నా కిపుడు సుబ్బారాయమంత్ర్యగ్రణీ.౧౪

శా. నీశాఖన్ జనియించు నంతటనె నన్నాల్ దక్కునే? తెల్పు స
ర్వాశామండలమండనాయితయశఃప్రాగ్భారధౌరంధరీ
వైశాల్యప్రథమానుఁడౌ సుకవి, గర్వాల్ నీకుఁ జుట్టమ్ములై
యీశత్వమ్ము వహింతురే? కవితయుం దేమయ్య? సుబ్బాయఁడా?

శా. చుట్టాలన్న మహాభిమాన మది యచ్చో నున్న చో వారికిం
బెట్టింపందగు భక్ష్యభోజ్యములు నీ పెంపెందు నింపొందఁగాఁ
బట్టుంబుట్టము లిచ్చి పుచ్చఁదగు, సంబంధంపు బాంధవ్యముల్
రెట్టింపందగు నంతెకాని యొరుఁ గాఁటింతయ్య? సుబ్బార్యమణీ. ౧౫

శా. నీయూహాహూతికి నేను వచ్చునెడల న్నిన్నప్పుడే ''యేమి య
న్యాయం బియ్యది'' యంచుఁ బెండ్లిసభలోనం బేర్మిఁ బ్రశ్నించి పై
నీయాంతర్యము బైటఁ బెట్టి పురము న్నీచేతఁ దన్వింతుఁ గా
నీ యట్టబ్బమి నేఁడు గోరనలసె న్నిన్ సుబ్బరాయాగ్రణీ. ౧౬

శా. లోకం బొప్పిన నొప్పకున్న నెటులాలోచించియో వ్రాసి తా
నాకవ్యగ్రణులంత మాన్యులని నిక్కం బస్మదీయాగ్రమం
దాకాంక్షించెదు బంధరుం దనిపి నీ వవ్వారికిన్ మాన్యతన్
నా కన్యాయము సంఘటించెద వె? యన్నా! సుబ్బరాయాగ్రణీ.౧౭

శా. ఏసారస్యములేని పిప్పికవితన్ ''హీంహీంలు'' లోకమ్ములో
ధీసంపన్నులు సాటెరుఁగ నుఱియ, వందిస్తోత్రముల్ సేయు మీ

దాసుల్ మాన్యులె? కాకవిత్వకలనాదైన్యంబు మాఱించు వి
ద్యాసంపన్నులుకారె మాన్యు? లిదియన్యాయమ్ము సుబ్రాయఁడా?

శా. నీ కీసంగతి లేశముం దెలియదో? నీకంటికిం జూపకే
యేకష్టాత్ముఁడుగాని ముద్రణమునం దీతప్పు గల్పించెనో?
లే కీపాకము నీకె తోఁచినదొ? యాలింపం బ్రయత్నించు నీ
లోకంబుం దనియించి నీనోడువు వెల్గుం గాక సుబ్రాణ్మణీ. ౨౦

మ. "ఎవఁ డాపండితుఁ?" డన్నయంతఁ దెగనీ ల్గిం తేల? మీకక్కటా
కవితామర్మ మెఱుంగవైతిరి వృథాకాఱుల్ వృథా ప్రల్లదాల్?
వివిధమ్ముల్ లిఖియించుచుంటి రెవఁ డావిద్వాంసుఁ డీలాటిదు
ష్టవిధుల్ నేర్పినవాఁడు? చెప్పఁ దగదే? సర్వజ్ఞ నా ధీనరున్.

మ. ఎవఁ డాతం డతఁ డెందునుండు, నతఁ డేయేపిద్దెలన్ మేటి? పే
రెవ, రెవ్వా రెయ్యది? యీసమస్యయెడఁ దప్పేలా నిరూపించె? స
త్కవియేనా? యతఁ డైనచోఁ దమకుమిత్రం బెట్టులయ్యెన్? వృథా
డివిడిప్వల్ లిఖియింప నేల? చెప్పుఁడా? డీకొందు మాసూటితో.

మ. ఎవఁ డాపండితుఁ డన్నఁ దప్పగునె? యేమీ? తెల్వితేటల్? వృథా
శివముం బూని దురాగ్రహాగ్రహములై "సీ"యంచు విద్వద్వరుల్
"తుపుతు" వ్వాంచు నిరాకరింపఁ దగు మీదుష్పంకపుంబల్లదా
"లవు మే"లంచని మెచ్చునాతఁ డెవఁడయ్యా? యెవ్వఁ డెవ్వాండయా.

మ. ఎవఁ డాపండితుఁ డెవ్వఁ డెవ్వఁ డతఁ డేఁడీ? యేఁడీ? సాక్షాత్తుగా
శివుఁడో? బ్రహ్మయొ? చక్రపాణియొ? భవత్సేవ్యుండు చెప్పుండు మీ
కవనమ్ముం సభ నిల్పునేని యపు డక్కవ్యాగ్రణీపాదదా
ర్భవముల్ శీర్షమునం ధరింతు మతఁ డెవ్వఁ, డెవ్వఁ, డెవ్వాండహో.

మ. సవిశేషమ్ము నెఱుంగనప్డు పయిపై సవ్వార్లు గాపించి యి
ష్టవివేకమ్మది బైటఁబడ్డయపు డేలా? రాఁడు విద్వత్సభా

భవనప్రాంగణసీమ కెవ్వఁ డతఁ డెవ్వండో? వచింపుండు ధీ
రవరేణ్యుల్ విని సంతసించెదరు సారజ్ఞత్వమున్ మెచ్చుచున్. ౫

మ. ఎవఁ డెవ్వం డతఁ డెవ్వఁ డెవ్వఁ డలవాఁ డెవ్వాఁ డెవం డెవ్వఁడో
యవివేకమ్ములు గిల్కనేల? స్పృహణీయాత్మున్ మహాభాగు ధీ
రవరున్ దెల్పుఁ డతండు మూఁకవితయున్ రావాఁడుఁగా కమ్మహా
కవి పాడే యొనరించుఁగా కతఁడె మ్రొక్కుంబూనుఁగా కమ్మేయున్.

మ. ఎవఁ డాతం, డెవఁ డాతఁ, డెవ్వఁ డతఁ, డేఁడీ? యేఁడి? రాఁడేమి? భా
రవియా? భూరవియా? సభాస్థలికి మీరల్ రా నొనర్పుండు, తా
రవలోకింతురు పండితాగ్రణులు, క[illegible]ర్యం బూరకే సారెకున్
గవినింద్యుల్ పొసఁగింప నేమియగు? వక్కాణింపుఁ డప్పండితున్.

మ. ఎవఁ డాతండు? వృథా మిమున్ జెఱిచె మీ రింకేమి సేయంగలా
రెవని న్నమ్మినవాఁడు మీయెడల నిర్లేయమ్యో మీసల్పు దు
ర్వ్యవసాయం బేఁక నెట్లు నెగ్గుఁ? జెడినాతయ్యా గడేకార్లు? మీ
బవరమ్మున్ జెడె మందభాగ్యులరు? మీపాళ్లింక నెట్లున్నవో? ౮

మ. ఎవని న్నమ్మితి నాది, నాతఁ డఃఖులమ్యో, న్నేఁ డితం డిట్టుల
యమ్యో, వివేకం బడి సున్నయైనయపు డిట్లే బంగరున్ జేతఁ బ
ట్టి వృథా మన్నగుఁ, బైడి పాడువడఁగొట్టున్ జాలు మీవ్రాతలం
దెవఁ డానందముఁ జెందు నాతనిని మీఁదిద్దేని వాక్రుచ్చుఁడీ? ౯

మ. ఎవఁ డాతండు భవత్పరాభవము నేఁ డెట్లో నివారించువాఁ
డవివేకంబునఁ గ్రొవ్వి తెచ్చికొని నేఁ "డల్లల్లబీ"రన్నచో
నెవఁ డేమేడ్చెను, గొంతువట్టికొని నష్టైవాఁడు చొచ్చున్ సభా
భవనంబున్, వసరోదనంబు లేఁక మీపక్షమ్ము రక్షించునే? ౧౦

మ. ఎవఁ డాపండితుఁ డెవ్వఁ డెవ్వఁ డెవఁడో? యెవ్వండో? యెవ్వండో? దు
ర్భవులన్ జేర్చుక తప్పువ్రాఁతలను ఖత్రా ల్పింపఁగాఁ జేసి మా

నవధర్మమ్మును వీటఁబుచ్చుచు దురాంధ్యమ్మందునన్ గ్రమ్గి కా
కవియో? ఘూకవియో? యనందగుసుధీకాంతుం డతం డెవ్వఁడో.

---

(దాదా భాయి నౌరోజీ.)

శా. యుష్మత్పాపవశమ్మునం గలిగె నయ్యో! పారసీకాంబుజ
గ్రీష్మాదిత్యుఁడు సర్వజాతిమతసంకీర్త్యుండు నీయుండియూ
భీష్మాచార్యులు దాదభాయి యనుపేరం బేర్గాన్న నౌరోజి కా
యుష్మత్త్రావధి; పెద్దదిక్కెవరు? నీ కోహో యికన్ భారతీ! ౧

సీ. జాతీయభావసంస్కారంబు గావించె
నఖిలభారతవర్ష మైక్య మొంద
"స్వరాష్ట్రకామన్ను" నం దోక మెంబరై
భాంతావని కెల్లఁ బేరు దెచ్చె
బ్రదికెఁ దొంబదిరెండువత్సరమ్ములు సుజ
నశ్లాఘ్యమౌ జీవనమ్ముతోడ
హిందూజనులు వృద్ధి నొందుసంస్కారింపు
ఘనతాపథంబు సంఘటిలఁ జేసె

తే. గీ. మనుజమాత్రుండె మతిదేవమంత్రి దాద
భాయినౌరోజి మనపెద్దభాయి యరిగె
తల్లి భారతభూమికిఁ దగనికడుపు
మంట గల్పించె దుఃఖాబ్ధి మనల ముంచె. ౨

సీ. అంబరచుంబితాయామంబు గల్గుఘ
నాలయ మ్మొకటి కూలిపోయె
గౌరవం బెసయు చక్రనిహార్మ్యరాజంబు
కడు జీర్ణమై నేలఁ గలిసె నొకటి

ఒకసౌధరాజంబునకుఁ గల్గెఁ గల్పితా
　　　　పత్రపథ గల ప్రతిబంధకంబు
తక్కిన పెక్కుసౌధంబులలోపలి
　　　　ప్రాకారకుడ్యముల్ పగులఁజొచ్చె
తే. గీ. పలుగృహంబులు పాడుగాఁ బాలుపడిన
　　వనుమఁ దలపోయకమ్మ యున్నంతలోనఁ
　　జిన్నయిలు పెద్దయిల్లుగాఁ జేసికొనుచుఁ
　　బాసిపోకమ్మ భారతీ! భరతభూమి. 3

తే. గీ. ఐహికసుఖమ్ము వదలియు నచట "దాద
　　భాయినౌరోజి" శాంతాత్మ పరమసుఖము
　　గొనుచు మనసీమ మెల్లఁ గన్గొనుచు మిగులఁ
　　బాటుపడుఁగాక కైవల్యపదమునందు. ౪

శా. జంబూద్వీపమునందు మేల్భరతవర్షంబందు ముఖ్యంబు చూ
　డం బాత్రం బయియున్న దీభరతఖండం బింపు మున్ముందు న
　ద్దండుల్ వుట్టిరి, పుట్టుచుండ్రిపుడు దాదాబాయినౌరోజిపీ
　ఠం బెవ్వారిని నెక్కఁజేసెదవొ? వేడ్కన్ జూచుకో భారతీ? ౫

---

(హంటరుదొర ప్రిన్సిపాల్)

ఉ. హంటరు గొప్పమేటి యని యాఖ్యలు మాటికిఁ జెప్ప వింతు నీ
　వంటిపరీక్షకుండు తలఁపన్ మఱియొక్కఁడు గాఁడటంచు మా
　వంటికపీంద్రులన్ దెలిసి వచ్చినకార్య మొనర్చు వంచు ని
　ష్కంటకమైనపేర్మి నిటుఁ గానఁగవచ్చితి వేంకటేశుఁడన్. ౧

తే. గీ. రాజు లెందఱినో చూచి రాణ నలరి
　　యిపుడు నీదర్శనమున కే నేఁగుదెంచి

యుంటి నాడువిద్వత్తుకు యోగ్యమైన
పదవి నిడి గౌరవింతువం చెదఁ దలంచి. ౨

క. బీ, యే, కే గాదు సుమీ?
పాయక యెమ్‌యేకు దాని పైతరగతికిన్
ధీయుతులు మెచ్చఁ బాఠం
బీయన వచియించు దాఁప నేమిటి కిచటన్. 3

---

(మల్లాడిసత్యలింగము.)

క. మల్లాడిసత్యలింగం
బెల్లెడ వెదఁజల్లినట్టి యీధర్మము వ
ర్ధిల్లుత సూర్యుఁడుఁ జంద్రుం
డెల్లలు నున్నంతవఱకు నెసకం బెసఁగన్. ౧

శా. సంపాదించుట దానికిం దగినసంస్కారోపయోగంబు గా
వింపం బూనుట దానికిన్ మఱియు నిర్విఘ్నప్రచారంబు యో
జింపం బూనుట సత్యలింగమునకే చెల్లెన్ సమస్తంబు చే
యింపన్ గల్గినకాకినాఁడసుకృతం బేమంచు వర్ణించెదన్. ౨

ఉ. శ్రీకరుఁ డుత్తముండు దురిసేటికులాంబుధిశీతరశ్మి వి
ద్యాకరుఁ డైనదాత వినయంబు నయంబును గల్గుప్రోడ యీ
ప్రాకటధర్మము న్నడుపుభారము శేషగిరీంద్రుఁ డూనె ధ
ర్మాకృతియౌ వదాన్యమణి యాదెయరెడ్డియుఁ దోడుసేయఁగన్. 3

తే. గీ. వేశవేల్ దానధర్మముల్ వేడ్కమీఱ
స్వాయమగాఁ జేయఁగల్గిన చతురమతులు
ధర్మకర్తలుగా నున్న ధర్మమునకు
లోప ముండునె? మఱియెంతప్రాపు గాక. ౪

ఉ. అందముఁ గోరఁగాఁ దగిన వస్త్రము, విద్య, సదాస్తికత్వ మీ
చందము సర్వముం దెలిసి సత్యవదాన్యుఁడు సత్యలింగ మ
న్నందుకు సార్థకంబుగ మహాత్ముఁడు ద్రవ్యము నిచ్చిపోయె ని
ర్నిందితచిత్తులైన మహనీయులు ధార్మికు లెల్ల మెచ్చఁగన్. ౫

సీ. అఖిలపాంథశ్రేణు లనుభవింతురు గాక
పుష్టితుష్టిగ మృష్టభోజనంబు
చదువుకొందురు గాక సకలవిద్యార్థులు
సర్వవిద్యలు లోకసమ్మతముగ
కాచియుందురు గాక కాణపంగ్వంధాది
దీను లన్నార్థులై దినదినంబు
అన్నసంప్రాప్తిచే నఖిలభూతశ్రేణి
సుచిరకాలము తృప్తిఁ జొక్కుఁగాక

తే. గీ. ఇట్టిసుకృతంబుకతన నీదృగ్విధప్ర
దాత యలసత్యలింగాఖ్యధార్మికుండు
మరల భూలోక మరయని సురవరేణ్యు
పట్టణనివాసభాగ్యంబు వడయుఁగాక. ౬

---

(నండూరి రంగనాయకులు.)

శా. సంగీతమ్మనఁగాని కొండొకమహాసాహిత్యపుం ధోరణీ
భంగింగాని ప్రసక్తి లేదు భగవద్భక్త్యున్నతిం దక్క నే
మింగానంబడ దిట్టిదయ్యుఁ బురి "మేల్! మే!" లంచు శ్లాఘింపఁగా
రంగం డెక్కుడుపేరు గైకొనియె శ్రీరామాయణంబాదునన్. ౧

ఉ. ఉండిరి శిష్యు లెందఱో మహోన్నతసూక్ష్మమతి నల్పవిద్దెలోఁ
గొండొకపేరు గైకొనినకోవిదు లీతఁడు వారిలోన నా

క్కంబుచు గామి నిశ్చయముకాని గురూత్తమభక్తి నేకల
భృత్యుం డటుగాన నీతనికి నుత్తమకీర్తి ఘటిల్లె నింక రం
గం బటకేగ నేమియగు గండరగండఁడు భక్తిపెంపునన్. ౨

చ. గురుఁడు నటేశుఁ డీతనికిఁ గొండొక యాతనిఁ గొల్చినాట్యపుక్
గ్రమమునం బ్రశస్తి గనినాఁ డలవిద్దియలోన హాస్యపుం
బరిమళమందు నీతనకిఁ బొండిలి మిక్కుటమిట్టిభక్తిసం
స్ఫురణము పూర్వజన్మకృతసత్కృతిలభ్య మటంచు నెంచెదన్. 3

చ. నలువదియొక్కనాఁడులు ఘనాఘనవర్ణుని రావణాంతకున్
దెలుఁగునఁ దేటతెల్లముగ స్త్రీపురుషుల్ గుమిగట్టివచ్చి యొ
క్కలిఁ బ్రపంచమున్ మఱచి కైవసమై విన రంగనాయకుల్
సలలితరీతిఁ బాడు టది శాశ్వతకీర్తిని గాంచుఁగావుతన్. ౪

ఉ. నందురిరంగనాయకులు నా కొకశిష్యుఁడు గాకపోయినన్
మోదముగ నా యెడం గలుగు మేదురభక్తిని వెల్లడించి శి
ష్యుండ నటంచుఁ జేర్కొనెడిచొప్పన కే నిటు లోఁగి వానికిన్
గొండొకదీవనల్ సలిపికోలున కియ్యెడ కేగుదెంచితిన్. ౫

ఉ. ఈతఁడు సెప్పఁగాక కత లెన్నియు నేని ఘటించునట్టిప్ర
ఖ్యాతులు లేనిచో నతనికౌశల మేగతిఁ బైకివచ్చు న
ప్రఖ్యాతచరిత్రులన్ దెలుపఁ బోలుఁ గదా? యొకకొంత నాకటం
చీతఱి వారలన్ గుఱిచి యించుక యిందుఁ బ్రశంస సేసెదన్. ౬

సీ. అర్చకోత్తముఁడు గోపాలార్యవరుఁడు పె
ద్దింటివంశ్యుండు సుధీరుఁ డొకఁడు
వంకినేని కులుండు వరగుణుం డైనవేం
కటసుబ్బయాభిఖ్యఘనుఁ డొకండు

వాకచర్లకులుండు ధీకలితుండగురామ
చంద్ర నామకుండు నిస్తంద్రుం డొకండు
కలిమిపట్టగుమహంకాళి వంశ్యుండు శ్రీ
రాము లనెడిగుణారమ్యుం డొకండు

తే. గీ. నడుముగట్టుక నిలుచుండినారుగాన
హేలపురిని సంతానగోపాలుగుడిని
రామపట్టాభిషేక మీరహిని జెలంగె
నోముంగాఫుత వీరి నీయుత్సవంబు. 2

సీ. శిష్యుండు రంగండు చెప్పిన రామాయ
ణపుహరికథ కారణమున నన్నుం
బట్టాభిషేక సంబంధ్యుత్సవమునకు
సబహుమానముగ నిచ్చుటికి వచ్చు
నట్లుగా ఘటియించి నలిని శ్రీ పెద్దింటి
కులుండు గోపాలార్య కోవిదుండు
వంకినేనికులుండు వరమతి పెద్దవేం
కటసుబ్బయాఖ్యుండు ఘనుండు శ్రీమ
హంకాళి శ్రీరాము లనఘుండు శ్రీవాక
చర్ల వంశ్యుండు రామచంద్రరావు

తే. గీ. పరమభక్తిని సేలువు వస్త్రములును
గనకకంకణము నొసంగి ఘనతరముగ
మేళతాళములొప్ప మేల్! మే! లనంగ
మున్న యూరేగం జేసిన ముచ్చట యిది
శాశ్వతంబయి ధరణి నెసంగుంగాక
ఘనత సంతాన గోపాలుకరుణం జేసి. 3

తే. గీ. ఆలయంబిది యభివృద్ధి నందుఁగాక
భక్తజన మెల్లెడల వృద్ధిఁ బరఁగుఁగాక
దేవభక్తుల కన్యోన్యభావగరిమ
మెఱుకపఱచెడి సత్కృతుల్ జరుఁగుఁగాక.

---

(ఆంధ్రనాటకసమాజము, కాకినాడ.)

ఉ. ఆడితి వాంధ్రనాటకసమాజమ! పాండవనాటకంబు నీ
ప్రోడతనంబు నీనటనపుంబొలుపుల్ గని గ్రంథకర్తలె
గ్గాడక లగ్గులాడిరి యితోధిక మైనయశఃప్రసక్తిఁ దూఁ
గాడుము కాకినాఁడఁ జెలువారుము నాఁటికినాఁటికిన్నిగన్. ౧

సీ. అఖిలాంధ్రదేశవిఖ్యాత నాటకసమా
జంబుల మిగులయశంబుఁ గొనుచు
సకలాంధ్రకవిరాజచారునాటక సంప్ర
దర్శనంబునకు నిదాన మగుచు
నిఖిలాంధ్రరంగవర్ణిత మైనపద్ధతిఁ
బాత్రౌచితికి నుతిపాత్ర మగుచు
సర్వాంధ్రలోకహృత్సరసీజములపట్ల
విలసత్సహస్రాంశుబింబ మగుచుఁ

గీ. గాకినాడను గొందఱుఘనులచేతఁ
బ్రకటితం బైనయాంధ్రనాటకసమాజ
మవని దేశోపకారపర్యాప్త మగుచుఁ
దనరుగావుత మా చంద్రతారకముగ. ౨

---

(విశాఖపట్టణములో జరిగిన ఐదవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభయందుఁ జదివినపద్యములు.)

సీ. మీకున్నధనశక్తిమేరకుఁ దగినట్టి
చితిఁ గట్టుపాత్రముల్ చేర్పుఁడయ్య
ప్రత్యాలయంబునఁ బ్రతిదినంబు పురాణ
పఠనగౌరవముఁ గాపాడరయ్య
పగలు రాఁజాలనిబహుగువారలకు రా
త్రులఁ బాఠశాలలు నిలుపరయ్య
తమసేయుపనుల నాదర్శంబుగాఁ ద
క్కినవారిసేత తక్కింపుఁడయ్య

గీ. భారతీసేవ సేయఁగఁ గోరుఁడయ్య
నిచ్చలును మాతృభాష మన్నింపుఁడయ్య
గ్రంథభవనంబులను జేర్పఁ గడఁగుఁడయ్య
తథ్యమతులార! ఆంధ్రసోదర్యులార! ౧

ఉ. ఒక్కొకచోట నీకరుణ నొక్కొకరీతిగ నుంచుచుందు వే
దిక్కునఁ దావకీనమగుదీప్తి వెలుంగుచునుండు దానికిన్
జక్కని తెల్వి వచ్చునని సజ్జనులే వచియింత్రుగాన మా
ప్రక్కకువచ్చి పల్లెల నివాసముసేయఁగదమ్మ! భారతీ. ౨

---

(చంద్రోదయము.)

శా. అధ్యాసించె శశాంకబింబ ముదితంబై తిర్యగంతశ్చల
ద్దధ్యాకారపయోధరస్థగితమధ్యస్థానమై తారకా
వీథ్యాదిక్ సురతావసానవిగళద్వేణీశిరోజావలీ
మధ్యాచ్ఛాదితపాకవైరితరుణీమాణిక్యతాటంకమై.

---

(సాలగ్రామము చింతామణిగారి కుమారుని వివాహసమయమునఁ
జెప్పిన పద్యములు.)

మ. కలుగుం గావుత సంపదల్, సిరియుఁ జక్కంగ గల్గెడింగాతఁ దా
నొలయుంగాత మరోగతా బలముతో నొప్పారునాయుర్బలం
బలరుంగావుత భద్రముల్ సతములై యాయుస్సుతోఁ పాటుగా
లలి నీకోడలికిం గుమారునకు సాలగ్రామ చింతామణీ. ౧

మ. నిను శిష్యత్వమునందుఁ గైకొనిన మాణిక్యానకుం బేర్మి ని
న్నును గన్నమ్మకు రాజరత్నమునకుం శోభాయమానమ్ముగా
ననుగుంబుత్రుని పెండ్లికిం బిలిచి నీదౌ విద్దియం మాకుఁ జూ
పిన చింతామణికిం శుభంబు లిడుతం వెన్నుండు శ్రీరత్నమా. ౨

---

(ఆణివిళ్ల వెంకటశాస్త్రిగారు.)

ఆ. వె. కైతయేగాని గీతియేగాని సభను
గోలనాపఁగ లేనిచో గోలగాదె?
గోలనాపెను బ్రహ్మయిల్లాలు తనకుఁ
దోడుగా నుంటచే బ్రహ్మ నేఁడు సభను. ౧

తే. గీ. వారణాసినామకమగు వంశమందుఁ
బుట్టి నీబ్రహ్మ యితఁ డెట్టిపట్టునందుఁ
గోటిజను లున్నసభనైన గోల నాపఁ
గలఁడు నిస్సంశయమ్మని కఱకు గాదె? ౨

తే. గీ. ఆణివిళ్ళయొ? లేకున్న గోణబిళ్ళ
యో? యెవఁ డెఱుంగు నిటువంటి యుత్సవంపు
సమయముల నిట్టిగాయకోత్తములఁ బిలువ
నంపి సభకు సంతోషంబు నింపకున్న. 3

తే. గీ. అమలకవనాన నగ్రహారముల గములు
తెచ్చి వంశస్థులకు నిచ్చె ధీవరుండు
వేంకటమనీషి, యద్దాని వివర మెఱిఁగి
కర్చుసేయఁడొడంగె వేంకటమనీషి. ౪

---

(ప్రతిజ్ఞ.)

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు విక్రాంతాఖిలాశాంతనై
రంతర్యప్రతిభాసమగ్రకపితా రాజ్యంబు పాలించుచున్
మంతుల్ దేశికు దూఱనాడినభవన్మంతుస్థితుల్ వోవఁ ద
త్కాంతాంఘ్రిద్వయి మీశిరంబు లిరవొందన్ జేయ కేనాఁటికిన్. ౧

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సారగ్రాహివిద్వన్మన
శ్చింతాధాయితథాకృతాసుకృతరాశీభూతవాగ్జాతసు
ధ్వాంతాలంకరణైకతానకవితాధార్ఢ్యంబునంజేసి గు
ర్వంతిస్థాప మొనర్చు మీచరిత మేదన్ జేయ కేనాఁటికిన్ ౨

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనర్ఘగ్రావభూమీనట
త్కాంతుద్వేషిశిరస్సరామరసరిత్కల్లోలలోలార్భటీ
సంతానోపమచారుధారకవితాసంతోషితాశేషభూ
కాంతాస్థానచరున్ గురున్ జెనఁకుపాపం బాప కేనాఁటికిన్. 3

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు రారాజద్యశఃకన్యకా
సంతానాయితభూమిపాలకసదాస్థానంబునం దుండియున్
జంతాకంతయు లేక పౌరుషముతో సిగ్గున్ విసర్జించి య
త్యంతాసభ్యము లాడుకాకవుల క్రౌర్యం బార్ప కేనాఁటికిన్. ౪

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సర్వక్ష్మాభృదాస్థానసు
ధ్వాంతస్థానచిరప్రసాధితయశస్తస్వీసదోపాసనా

శ్రాంతశ్రాంతయశఃప్రభూతకవితాసామ్రాజ్యసింహాసనా
క్రాంతుల్ దేశికు దూఱుమోఱకులపాంకం బార్పఁ గేనాఁటికిన్. ౫

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పర్యాయాదృతానేకసా
ధ్వంతేవాసికృతావధానసమయవ్యాఖ్యానవిఖ్యాపితా
శాంతస్థాయియశఃప్రసూనకవితాసౌందర్యరాజద్గళో
పాంతుల్ దేశికుఁ దిట్టుకట్టెఁడుల గర్వంబార్పఁ గేనాఁటికిన్. ౬

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నిర్యన్మాధురీహూత్రస
ర్వాంతర్వాణివరేణ్యపూతరసనాధారాదరోదాహృతా
నంతశ్లోకరసోరుపద్యరసపానాప్తాయుసాధుస్తుతో
దంతుల్ దేశికుఁ గూర్చి వ్రాసినయసత్యాల్ మాన్పఁ గేనాఁటికిన్

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పారంపర్యసంప్రాపితా
చాంతామేయరసప్రసిద్ధకవితాసౌకర్యసాఫల్యకృ
ద్వ్యాంతాసంఖ్యనవప్రబంధపఠనవ్యాప్తత్రిలింగాభిధా
నంతుర్ద్దేశికు నొంచువంచకులపాంగార్వంప గేనాఁటికిన్. ౮

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నిర్లజ్జావలేపుల్ వృథా
హంతాదంతురితాంతరాత్మకు లసత్యాలాపమూలాక్షరుల్
భ్రాంతుల్ దుష్కవితారసజ్ఞు లగుమూర్ఖశ్రేణి ప్రత్యర్థులై
గంతుల్ వైవఁగ వారిగంతు లణఁగాఁగం జేయ గేనాఁటికిన్. ౯

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మార్జారాభియానాదృత
స్వాంతంబాగజమ్ముల్ కత్తృణము గాల్పం బూను కాలాగ్నియ
ట్లంతేవాసికృతాపరాధజనితాహంకారుఁడై పోరుది
గ్దంతిన్ దేశికు వేడఁ జోనిఖిలకృత్యం బార్పఁ గేనాఁటికిన్. ౧౦

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు ప్రారబ్ధాతిరేకమ్మునన్
గొంతేరమ్మలు ముందు కయ్యమునకున్ గూఁకట్లు జాడించి కా

సంతైనన్ ద్రపలేక పాఱుదురు గాక వ్వారిఁ బాకాలయా
శ్శాంతస్థాయుల బైట కీడ్చి వదరుల్ మాయింప కేనాఁటికిన్. ౧౧

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు దుర్గర్వప్రకోపమ్మునన్
క్షంతవ్యమ్ములు గాని నేరములు లక్షల్ సేసి యాపిమ్మటన్
గంతవ్యంబు నెఱుంగలేక మనముం గంపంబు వేధింపఁగా
గ్రంతల్ దూఱియుఁ ద్రేలువాండ్రపస గంగం గల్ప కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనిర్వాచ్యప్రభావోల్బణా
క్రాంతానేకశతావధానకవనప్రారంభవేళాకృతా
త్యంతస్తోత్రసముత్సముత్క-హిమవత్క-న్యాదయాగణ్యకృ
త్యాంతుం దేశికు నల్వఁ గొల్వనియకృత్యం బార్ప కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సారస్యజ్ఞుచే గ్రంధమున్
సాంతంబుం జదివించి యందలియసత్యాలాపముల్ చించి మీ
చెంతన్ మీకృతులందు గోమయపయస్సేకంబు చేయించి భూ
కాంతాస్థానములందుఁ దద్యశముఁ బ్రాఁకం జేయ కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు స్వారాజేనియుం జారుపా
క్రాంతంబైన మనమ్ముతో సతతముం గాల్ద్రవ్వ మాతోడ స్వో
పాంతంబందో మఱెందో యొక్క-సభఁ జేయుం జేయ మీ మా కవి
త్వాంతర్యమ్ములుచూపి మీపొగరు మాయుం జేయ కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సంరంభమ్ముతో వర్ధితా
హంతావేగముతో వధానభృతవిద్యాచాతురీధాటితోఁ
బంతం బొప్పఁగవచ్చి పండితకవీట్ప్రాంతమ్మునం బాండితీ
కుంతాగ్రమ్మున గొంతునొక్కి చపలోక్తుల్ మాప కేనాఁటికిం.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మర్యాదావిదుం భూపతిన్
దాంతుం బాత్రశిరోవతంసు నయవిద్యాజన్యసౌజన్యసి

ద్ధాంతుం గొల్చియు సుంతయేని యభిమానాహంయువుల్ రాక వి
క్రాంతాలాపము లాడువాండ్ర తలభారం బూడ్చ కేనాంటికిన్.

శా. ఆంతుల్.మానండు తిర్పతిద్విజుండు వైరంబున్నచోం బౌరుషం
బెంతేం జూపెడి నెల్మరాజ్యమున "మేమే" యంచుం గైతమ్ములన్
గంతుల్ వేయుచు వ్రాంత వ్రాయుచుం గ్రియాకాలమ్ములన్ భీతి నా
ప్రాంతం బోవని మోసగాండ్ర కలరూపుం దేల్ప కేనాంటికిన్. ౧౯

శా. "ఆంతుల్.మాను" మటంచు మిత్రుఁడవు నీరంధ్రావివేకాన్విత
స్వాంతు న్నిన్నొగి సత్సభాస్థలికి నీడ్వంజేసి యుష్మత్కవా
గ్వాంతుల్ మార్చి శిరోభరం బుడిపి పై వాత్సల్యముల్ జూపి ధీ
మంతుల్ మెచ్చ ననుగ్రహించునంట! యామర్యాద లాలించితే.

శా. "ఆంతుల్ మానండు తిర్పతిద్విజుండు" నీరంధ్రావివేకాన్విత
స్వాంతభ్రాంతనిరంతరాస్పదవచఃప్రక్రాంతపుష్కల్పనా
ధ్వాంతక్రాంతకుకావ్యనవ్యరవిదీవ్యద్భవ్యతేజోంచితా
హంతాదంతురవాక్ప్రగాఢకల నీహ మార్గప్ప కేనాంటికిన్. ౨౦

శా. "ఆంతుల్ మానండు తిర్పతిద్విజుండు" ధరమ్మన్యతామద్ధత
స్వాంతాత్యంతదురాగతప్రవణనీచాచారవాచాటకా
చాంతానంతకృతఘ్నతాభరసురాసర్వస్వనిర్వాపణా
ద్వాంతుల్ కొండొక వృద్ధిచేసి మొగముల్ వాడింప కేనాంటికిన్.

మ. "అలంతన్ జెందకు" మంచు మిత్రుఁడవు నిన్నం తేవ సద్ధర్మసం
చలితున్ దుర్లలితున్ దురాగతు దురాచారప్రచారున్ సభా
స్థలి కెక్కించి స్థలద్వచస్కుఁ గళదుద్యత్స్వేదుం గావించి లో
కులకున్ జూపి శిరోనతుల్ గొని కృపాంకూరచ్ఛటల్ నించి ని
చ్చలు రక్షించి యనుగ్రహించునంట! తచ్చాతుర్యముల్ గంటివే?

మ. అలంతన్ జెందండు వేంకటాచల మహాత్రాంతేవసద్ధర్మదా
విలనిర్భీకకృతఘ్నతాజ్వరభరోద్వేగప్రభావప్రభా

స్ఖలదాచారవచఃప్రచారవిలయాఖండౌషధప్రాయుని
ర్మలనీహారమనోహరాత్మకృతిఁ బర్వం జేయ కేనాఁటికిన్. ౨౩

శా. "రాపుల్ వీకు" మటంచు మిన్కొదవు ధీరమ్మన్యుని న్నిన్ను దు
ర్వ్యాపారున్ సభలోని కీడ్చి భవదారబ్ధాపవాదానృతా
లాపంబుల్ మొదలంటఁ గాల్చి పయి వాలాయంబు శిక్షించి నీ
పాపంబూడ్చి నతుల్ గ్రహించునఁట! తత్ప్రాగల్భ్య మూహించితే?

శా. 'రాపుల్ వీడఁడు వేంకటాచల' మనారస్ఫారఘోరానృతా
లాపాంతేవసదాస్యకర్కటవిశాలశ్వభ్రదుర్వ్యాగ్రహిః
ప్రాపత్తారతరావిలాంబుపృషదాపత్త్రిపకాత్మీయవా
గ్రూపాసాంపరంపరాపిధవముల్ గుప్పింప కేనాఁటికిన్. ౨౪

శా. 'డంబాల్ మాను' మటంచుమిన్నైదవు ప్రౌఢమ్మన్యతాదోషమూ
ఢం బైనట్టి భవన్మనంబునకు వ్రీడన్ బుట్టఁగాఁ జేయు ని
న్నుం బాండిత్యనిధాను లుండుసభయందున్ బట్టి రెట్టించి గ
ర్వంబు న్మాన్పి యనుగ్రహించునఁట! తద్వాత్సల్య మూహించితే?

శా. 'డంబాల్ మానఁడు తిర్పతిద్విజుఁడు' వ్రీడాశూన్యధన్యేతరా
లంబాలంబితగర్వఘూర్ణహృదురాలాపానులాపస్వన
చ్ఛాంబూకాయితసప్తనైకవికృతచ్ఛాత్రాపచారస్వరూ
పంబున్ బూర్తిగ రూపు మాపి దెసలం బ్రాకింప కేనాఁటికిన్.

---

(మల్లేశభక్తసమాజము, కొన్ని పద్యములు.)

శా. శాస్త్రాభ్యాస మొనర్చుటో? సభలలో శాస్త్రార్థముల్ సల్పుటో?
నిస్త్రాసమ్మున వేయుమందికయిన న్నేర్పొప్పఁగాఁ బద్యముల్
శస్త్రోత్సర్జనరీతిఁ గుప్పుటయొ? దేశా లేగుటో? కాక ది
గ్వస్త్రా! నిన్ను వశమ్ముచేసికొను భాగ్యం బెన్న మల్లేశ్వరా. ౧.

మ. కలకాలమ్మును నాదుగర్భమున నీక న్నిల్వమీ యంటినా?
బలిమి న్నాదగునింట బుటుతన మూపాదించి రమ్మంటినా?
తులలేనట్టివిసమ్ము ద్రావుమని నీతో నంటినా? లేక, నీ
తల హస్తం బిడఁబోతినా? యికను నాతప్పేమి మల్లేశ్వరా. ౨

సీ. కుశలమల్లంపల్లిగోత్రసంజాతుండు
మల్లేశపూజాభిమానహృదయుఁ
డుపసద్గుణాఢ్యుండు గురుసుధీమండల
పూజనాసక్తుండు భూమిసురుఁడు
పాపాంబికాసతీపాపయారాధ్యత
పఃఫలం బత్యంతపావనుండు
శంభులింగాభిధసత్తమరామలిం
గానుజుండును సుధీమానసీయుఁ
డానందసాంద్రచిత్తాబ్జుండు భైరవ
కరుణాకటాక్షవీక్షణబలుండు
మల్లేశభక్తసమాజసంస్థాపకుం
డస్సద్ధితుఁడు భైరవాభిధుండు

తే. గీ. ఆత్మభైరవముద్రాక్షరాలయమునఁ
గూరుమంచి యొకప్పుడు కూర్చి దనర
దీనిఁ జేయు మటంచుఁ బ్రార్థింప దీనిఁ
దెలుఁగునను జేసినారము దీనిపేరు
మహితమల్లేశనక్షత్రమాల యండ్రు
కవులు తిరుపతివేంకటాఖ్యవరమతులు. 3

---

(దివ్యజ్ఞానసమాజము.)

శ్లో. యూరప్ఖండనివాసకో నిరుపమో విద్యాసుధావారిధి
స్స్వక్యాత్మీయమతం యథార్థధిషణాస్సిడ్నివియెడ్జ్వాహ్వాయః
అస్మాకం మత మేవ యుక్త మితివై సంబోధయత్యాదరా
త్సర్వే హిందూమతానుసారిమనుజా స్తం శ్లాఘయేయుఃపరం.

శ్లో. పూర్వం శంకరముఖ్యై రుజ్జీవిత మస్మదీయమత మేతత్
ఇహాతిజీర్ణప్రాయం పునరుజ్జీవయత్యేష హ్యూణోపి. 2

శ్లో. గీర్వాణభాషాధ్యయనం వరం స్యా
దిద్ధం భృశం ప్రోక్తమనేననూనం
ఇదం సమాలోచ్య తథైవకర్తుం
బాలాయతంతా మురుభక్తియుక్తాః. 3

చ. జనకుఁడు దా మిషన్మతవిచారమువాఁ డయియొప్పుచుండఁగా
మనమతమే మనమ్మనను మంచి దటంచును నెంచి బోధచే
సిన సుగుణాబ్ధిహ్యూణుఁ డగు సిడ్నివియడ్జినిఁ జూచియైన నె
మ్మనమున హిందుసన్మతము మన్ననఁ జేయుఁడు బాలకోత్తముల్. 4

క. ఈదివ్యజ్ఞానసమా
జాదినిమిత్తం బనంగ నలరెడినాఁక్కా
డాదుల నీసిడ్నివియె
డ్జీనోర నెల్లప్పుఁ బ్రోచు శ్రీపతి కరుణన్. 5

---

(పలూరుకాంగ్రెస్సుసభ.)

క. పన్నఁట! యూపై నింకొక
పన్నఁట! యామీఁద నొక్కపన్నఁట! యూపై

పన్నఁట! పైపన్నఁట! పై
పన్నఁట! వర్తకుఁ డీఁకెల్లు బ్రతుకం గలఁడో. ౧

ఉ. అక్కటవేళ నీ ఱడినయాతనపా లొకకొంత, ప్రైవయిన్
బొక్కడితీరువాయి యనుభూతముపా లొకకొంత, యూవయిన్
దక్కఁగలట్టిపన్నులకు దాఁపినపా లొకకొంత, హాలికుం
డక్కట! యప్పుపా లగుచు నాలిని బిడ్డల నమ్ముకోవలెన్. ౨

---

(జిల్బేరుదొర-యానాము.)

సీ. శేషునిఁ బోలి లెక్చరు చెప్పఁగాఁజాలు
జిల్బేరుగా రొక్కరెంత నొప్ప
నతని లెక్చరు విని యలరు నానావిధో
ద్యోగస్థులును మఱిం కొకట నలర
తెలియ దేమందురా దేవుఁడా? ప్రాన్సుభా
షయును మాంద్యశు లొక్కచక్కఁ దనర
ప్రాన్సుభాషను మీఁదఁ బఠియింతు నంచును
బల్కువారలు నొక్కప్రక్క నెసఁగ

తే. గీ. సర్వదేశసమాచారసంగతులను
సర్వజనులకు విస్పష్టసరణి నెఱుక
పఱచుటకుఁ గాదె యీసభ జరుపఁబడియెఁ
బొలుపు మీఱ యీయానాముపురమునందు. ౧

సీ. పదియు నెన్మిదియు నాఁ బరఁగుద్వీపములఁ బ్ర
బలులైనవారు మా ఫ్రాన్సువారు
శ్వేతముఖాఖ్యఁ బ్రసిద్ధిఁ గాంచినహూణ
వరుల పైవారు మా ఫ్రాన్సువారు

ప్రజలమీఁద నె కార్యభర మూఁచి రాజ్యమ్ము
పచరించువారు మా ప్రాన్సువారు
కలియుగమ్మును సత్యకాలమ్ముగను నొన
ర్పఁగఁ జూచినారు మా ప్రాన్సువారు

తే. గీ. పన్ను హెచ్చించి ప్రజలకు బహువిధముల
బాధఁ గల్పింపఁబోరు మా ప్రాన్సువారు
పలుపలుకు లాడ నేల? బిడ్డలకుఁ దల్లి
వంటివా రెల్లప్రజకు మా ప్రాన్సువారు. ౨

సీ. అంగవంగాదిదేశాంతరమ్ముల కేగఁ
గాన నీతఁడు బహిష్కార్యుఁ డనియు
పొగయోడపై సముద్రగతి నీతఁ డొనర్చె
వెలి యీతనికి వేయవలయు ననియు
హూణసంపర్కమ్ము నొందె నీతం డనా
చారుఁ డీతని కసత్కార మనియు
నన్యభాషను భోజనాదివేళలఁగూడఁ
బల్కువాఁ డీతఁ డప్రాశ్యుఁ డనియు

తే. గీ. మనమతస్థు లొనర్చునిందను సహింప
లేక మనహిందువులు భూమిలోకమందుఁ
గొంతయైనను మఱియు నొక్కింతయైనఁ
జూచియెఱుఁగరు చూడరు చూడఁబోరు. 3

ఉ. కన్నులు గల్గియుండియును గన్నులు లేనివిధమ్మునన్ జగ
మ్మున్నది, లేనిపోనియుపయోగము లీమతమందు నుంటచే
నన్నియు నొక్కరీతిగనె యాశ్రయణం బొనరించుహూణు ల
న్నన్న! మఱెట్టిపుణ్యముల నంది జనించినవారలో కదా. ౪

సీ. బుద్ధిచేతనకాదె? పొగ సహాయముచేసి
నౌకల నీటిలో నడపుటెల్ల
బుద్ధిచేతనకాదె? పొరుగుదేశములకు
నంతలో వార్తల నంపుటెల్ల
బుద్ధిచేతనకాదె? భూమినగ్గడలఁ గా
ల్వలు పాఱఁగాఁ జేయఁగలుగుటెల్ల
బుద్ధిచేతనకాదె? పొగబండి నొక్కొక్క
గంటలో దూరమ్ము గడపుటెల్ల

తే. గీ. అట్టిబుద్ధులు హూణులయందకాని
హిందువులయందు లేవని యూహచింపఁ
గాని మనహిందువులబుద్ధి కార్యకార
కత్వమును బొందదిది యేమి కర్మఫలమొ? ౫

తే. గీ. అట్టిహూణులయందు ముఖ్యమగునట్టి
దెద్ది యన్నను? లోకోపకృతికిఁ బాటు
పడుట, యయ్యది ధనమున బలిమికతన
బుద్ధివలనను నొనరింపఁ బోలుఁ గాదె? ౬

చ. ఇది యిటు లుండ నిష్ఠ వహియింపఁగఁ బూనిన దెద్ది యన్న? న
ర్వదిహ యిమూఁడువే లనఁగఁ బర్వెడిమైలులదేశ మీతఁ డిం
తదనుకఁ గాళ్ళచేఁ గడచి తద్దయు నచ్చట నచ్చటన్ ముదం
బొదవఁగఁ జేయుచిత్రముల నొప్పఁగఁ జూచె మనుష్యమాత్రుఁడే.

సీ. జనియించినాఁడు ఫ్రాన్సునుదేశమున బాల్య
మంద విద్యాభ్యాస మందినాఁడు
అటుమీఁదఁ గొన్నాళ్ళచటఁ దనదేశము
నందుండురీతుల నరసినాఁడు

అటుమీఁద సర్వదేశాంతరమ్ములనుఁడు
చిత్రముల్ జూడ వాంఛించినాఁడు
వాంఛించి తా నింతవట్టు కలువడిమూఁడు
వేలమై ళ్ళేగియు వెలసినాఁడు
తే. గీ. ఏగి యందలిచిత్రమ్ము లెల్లఁ జూచి
నాఁడు చూచినవెల్ల నందఱికిఁ జెప్పి
నాఁడు మన కీదినము చెప్పినాఁడు గానఁ
బ్రియకరుఁడు గాఁడె ప్రజకు జిల్బేరుగారు. ౮
క. ఏకోనవింశతిశతా
ఖ్యాకలితాబ్దమ్మునందుఁ గానున్నసభన్
జేకొని లెక్చరు నీయఁగ
నీకష్టం బోర్చి దేశ మీతఁడు దిరిగెన్. ౯

(ఆకొండి రామమూర్తిగారు.)

మ. కవిత న్నైపుణి గాంచి చక్కఁ జదరంగం బాడఁగా నించి గా
నవిధిన్ బద్యములన్ బఠింపఁ దగువిన్యాణంబు నార్జించి, వం
శవశం బై యెడఁబాయకున్న యలభైషజ్యమ్మునన్ జక్రవ
ర్తివి నై యొప్పితె? రామమూర్తి! శమితార్తీ! కీర్తికి న్మూర్తివై.

---

శ్రీరంగేశ నవరత్నమాలిక.

శా. దారిన్నీచులు పూలు లంచమిడినం దానంబ్రమోదింతు వో
రారా! యెంగిలిపం డ్లొసంగినను వింతౌ మోదముం బొందెద
య్యారే! "లంచములేసమాట" యను సామ్యంబేనిజంబౌ యెఁగా
శ్రీరంగేశ్వర! నీవుదక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్. ౧
శా. దారిద్ర్యంబునఁ బొట్టకూటికయి నిన్ దర్శింపఁగాలేదులే

యూరా! కట్టఁగబట్ట లిమ్మనుచు నిన్నాసింపఁగా లేదులే
ధారాళంబుగ నొక్కమాటవిను నీతత్వంబు నేఁ గోరితిన్, శ్రీ. ౨

శా. తూరంబో విషముండుగుంటయొ మహాసర్పంబొ లేకున్న నా
భీరాగారమొ గోష్ఠమో మలినగోపీపీనవక్షోజమో!
యేరీతిన్ వసియింతు నామనమునం దేలాగు కాలాగునో? శ్రీ. 3

శా. భారంబౌగిరి మీఁదఁబెట్టి నిను నే బాధింపఁగాఁ బోనుగా?
నారత్నంబులఁ దోలుమం చననుగా? నాకార్యసంసిద్ధికై
నాత్రీహత్యను గట్టుకొ మ్మననుగా నాతప్పిదం బేమియో? శ్రీ. ౪

శా. దారం దొంగిలినట్టివానియనుగుం దమ్ముండనా? తండ్రితో
వైరం బొందినవాఁడనా? మఱియు నెవ్వాఁడన్న నుం బ్రోవఁగా
భారం బేమగు నీకుఁ బాప! మయినం బాలింపకే తీరునే, శ్రీ. ౫

శా. నేరంబు ల్గ్రహుఁ జేసినాఁడననుచు న్నిక్కంబుగా నీమచే
తో రాజీవమునందుఁ దోఁచినను నాతో ముచ్చటింపంగ నీ
వేగన్మోనను వచ్చి కూర్కలిగరాదే? నేను నద్దంపునే? శ్రీ. ౬

శా. దారంబోయును సర్వలోకముల నౌదార్యంబుతోనంచు నేఁ
గోరంబోదునటంచు భలిపడి నాకుఁ దర్శనం బీయవో
క్రూరుండంచుఁ బరిగ్రహింపవొ మఱిన్ గోపమ్మొ చెప్పంగదే, శ్రీ.

శా. సారంబౌ భవదీయనామమును మెచ్చన్నోరు రాదెంతొ ని
స్సారాలాపములన్ వచించుటకు వాచాలత్వము ల్మ్రోగు చే
తోరీతిన్ మఱలింప నాతరమె? నాతో నీకు వాదేల? యో, శ్రీ.

శా. ఘోరంబైనతపంబు జేయుటకు నాకున్ శక్తి నీ వీయలే
దేరీతిన్? గనుగొందు నిన్ను నిఁక నే నెవ్వారలం జేరుదున్
గారుణ్యం బెద నుంచి నిక్కముగ వేగ న్నన్ను రక్షింపుమా!
శ్రీరంగేశ్వర! నీవుదక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్. ౯

(నాంది.)

తే. గీ. వేఁగునంతకు వలవంత వేగిరింత
నంతిపురమునఁ బ్రమదవనాంతరమునఁ
గృష్ణ! కృష్ణా! యటంచు నాకీరవాణి
రామ! రామా! యటంచు నారాజసుతుఁడు.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(నిట్టూర్పుతోఁ బ్రవేశించి తూలిపడిపోయి గుఱ్ఱు పెట్టుచు నిద్రించును.)

నటి—(ప్రవేశించి) బావా! బావా! (కొట్టిలేపును.)

సూత్ర—(కొంచెము కదిలి కన్నులు నల్పి నీలిగి మరల నిద్రించును.)

నటుఁడు—(ప్రవేశించి విచారముతో భూమివంకఁ జూచి) అక్కటా! చంద్రమండలంబు వెల్లప్రకాశించుచున్నదో? వెల్లవేసిన దిష్టి పిడతమీఁదిమూఁకుడువలె నున్నది.

నటి—(కన్నీరునించి) బావా! కడుఁ జక్కఁగా వర్ణించితివి. (కౌఁగిలింపఁబోవును.)

నటుఁడు—(మీఁదఁబడి గట్టిగాఁ గౌఁగిలించుకొని) మంచిదానవే! నేను నీబావను గాను. నన్నుఁ గౌఁగిలించుకొన్నావేమో? నే నేకపత్నీవ్రతుఁడను నావ్రతము చెడఁగొట్టకుము.

నటి—(విడిపించుకొని సంతోషముతో) పొరఁబడితినికదా!

సూత్ర—(ఉలికిపడి లేచి దిక్కులు చూచి చిఱునవ్వుతో) యేమి టాఅల్లరి? మి మ్మిక్కడి కెవరు రమ్మన్నారు? త్వరగా వెడ తారా? లేకపోతే తన్నమన్నారా?

నటు—నీ వెందుకు వచ్చేవు ?

నటి—(బిగ్గఱంగా) మా బాగా అడిగినాఁడు. దీని కేమిజవాబు చెప్పనో చూడవలెను ?

సూత్ర—(ప్రీతితో నావలికి గెంటి) ఆట్టే తెగనీలిగితే నీకు తన్యప్రహారణాలు తగులుతాయి. నేను పిలవందే నీవు రాకూడదు. కావలిస్తే పండితులని కనుక్కో—! (సభవంకఁ జూచి) నీవుగూడా అతనితో లోపలికి పో, రమ్మనేదాకా రాకు.

నటి—(ఆకాశమువంక చూచి) ఆర్యపుత్ర! మీరెంతకోప్పడ్డా నే వెళ్ళేదాన్ని కాను. ఆమాటకువస్తే నిన్నెవరు రమ్మన్నారు? వచ్చినవాఁడవు నిద్దరోవడ మెందుకు ?

సూత్ర—(గడగడ వడఁకుచు) నాకు నిద్దరొచ్చింది పోతూవున్నాను నన్నడగడానికి నీకేమి అధికారం ? కావలిస్తే నిద్దర నడుగు.

నటి—(పరిక్రమించుచు) నే నడక్కమానను. జవాబు చెప్పితీరాలి.

[తెరలో కలకలము. బొడ్డుబాలతాత ప్రవేశించుచు]

బొడ్డు—(ఇటునటు దురుసుగాఁ దిరుగుచు) మాదిగముండాకొడుకుల్లారా ! మీరనోన్యన్యం జుట్టూ జుట్టూపట్టుకొని కొట్టుకోవడానికేనా ! యిక్కడికి వచ్చింది. ఈపాటికి తెరలోనికి చావండి నేను కోర్టుచేసి మంత్రితో రాచకార్యాలు మాట్లాడాలి.

సూత్ర—(విచారముతో) గాడెదగ త్తరకొడకా! నీవు రావడానికి నీ వెనఁడవు? నేను రమ్మనందే రావద్దని యెన్నిమాట్లు నీకు చీవాట్లుతగిలినా బుద్ధి లేదు. సూచనలేనిదే నీ వేలా వచ్చావు? రావడమే కాక, అది తప్పంటామేమో అని మమ్మల్ని తిట్టడంకూడానా? ఇంకా ప్రస్తావనేకా లేదుకదా! యెఱుఁగవా! మళ్ళా తిట్టిచూడు! నీప ళ్ళేమవుతాయో।

బొడ్డు—అలాగయితే యీవేళ నేను మీనాటకంలో కేరక్టరే వేయను. నేను కింగునని యెఱుగుదువా? వెధవసూత్రధారు ముండాకొడుకువు నీసూచన నాకెందుకు? అప్రస్తావనేదో యేదుపు మళ్లా వచ్చి నీపని చెప్తా.

సూత్ర—(బిగ్గరగా) అబ్బో! వీఁడి కెంతపొగరున్నది. ఈనాటకంలో రాజుగా వేష్ని వేసికొన్నంతమాత్రాన్ని వీఁడు మాఅందఱికీ నియామకుఁడనని విఱ్ఱవీగుతూవున్నాఁడే? (తనలో) నీవే లోపలికిపోయి అఘోరించు.

బొడ్డు—ఈయేదుపు నీది. నాది కాదు. తెలిసిందా? నిన్ను సూత్రధారుణ్ణిగాఁ బెట్టుకున్నందుకు మేనేజరు ననాలి కాని నీలోపమేముంది. (నిష్క్రమించును)

[తదనంతరభల్లూకుఁడు ప్రవేశించును]

తద—(దిక్కులుచూచి) స్టేజిలో మొక్కలు చక్కఁగాఁ బెరుఁగుచున్నవి. ఇవి క్రోటన్సు కాఁబోలు. ఈనేల మాగణిగా నున్నది. ఇది పాటినేల కాఁబోలును. (కళ్లుమూసికొని) ము ॥ రాజేఁడీ? దిక్కుమాలినముండాకొడుకు నేరానిదే యెక్క.. కెళ్లేఁడో?

సూత్ర—(కన్నీరుతో) మానాటకానికి కింగెట్టివాఁడో మినిస్టరున్ని నీవున్నూ అట్టివాఁడవే. అంబానికి నేనున్నూ, గానానికి మా అప్పా అన్నట్టు కుదిరారు. ఈకాస్తసేపైనా, కాస్తలోక్యంగ సంచరించమంటే, నీకు చేతకావడం లేదు. పౌరోహిత్యంచు.. డాకొడుక్కి మంత్రికేరక్ట రేం తెలుస్తుంది? నీమంత్రికేరక్ట.. న్నూ, వాడిరాజుకేరక్టరున్నూ చూస్తే నాకు ప్రతాపరుద్రీయంలో చాకలిపేరడివేషం జ్ఞాపకం వస్తుంది. యిదేనా? నాటకము; రాజును చీవాట్లుపెట్టి లోపలికి పొమ్మంటె అసలోకం..

లాగు మళ్ళా నీవొచ్చేవు? ఓరీ! వైదీకిముండాకొడకా! యీ పాటికి లోపలికి తగులడు. రాజు లేనిదీ యిక్కడ నిన్నేవడు చూస్తాడు.

తద—(సంతోషముతో) ఆట్టే తెగనీలిగితే చెప్పుతీసుకు కొడతాను. నీసూత్రధారుతనమాత్ర మేమంత మండింది. రావడంతోనే నిద్రబొమ్మని యెక్కేసింది. "ముద్దుగుడవరా! ముదివెళ్ళికొడకా" అంటే "అవినేణికుండలదగ్గర చచ్చినట్టే తొంగుంటా" నన్నాడట. నీ తెలివింత శ్రాద్ధయోగ్యంగా వుండగా నువ్వు నన్నాక్షేపించవచ్చావు?

సూత్ర—(భయముతో) అవును. నేను శ్రాద్ధపుకూళ్ళు కుడిచేవాఁడనే; లోపలికి దయచేయి. వృథాగా నన్ను తిడతావుగాని, మనవిదూషకుడిచేత బ్రాహ్మణార్థాలు నూనిపించావు కావు కదా? ఆవెధవ నిన్న యీన్నూరు వచ్చే రావడంతోనే, యెక్కడో, గొట్టెక్కలు విరిచాడుసుమీ; పోనీకాని, యిఁక ప్రస్తావనకు మొదలుపెడుతూవున్నాను కొద్దిగొప్ప నాసూచన లేందీమాత్రం వ్వారికే చెవిపుచ్చినకుక్కలలాగు రావద్దని మన వాళ్ళతో గట్టిగాఁ జెప్పు.

తద—నేను చెప్పను. అపాత్రముండాకొడుకా! నన్ను శ్రాద్ధపుకూళ్ళంటావు కాదూ! విరోగం కుదురుస్తా! నేనివేళ మంత్రివేషం వెయ్యనే వెయ్యను. వైదీకి మంత్రిత్వానికి పనికిరానప్పుడు నేనెందుకు? ఒకవేళ వేస్తినా? అప్పుడు రాజు నాకు చెప్పినట్టు వింటాడు గనుక నీపని బట్టేస్తాను.

సూత్ర—ఏడిశా వీపాటికి లోపలికి చావు.

తద—నువ్వే చావు. ఈడ్చిపాటవేసేవాళ్ళను పిల్చుకొస్తాను.

(అని సభకేసి పోఁబోవును)

సభాపతి—(రంగస్థలంలోకివచ్చి తదనంతరభల్లూణ్ణి పట్టుకొని) అయ్యా! నాటకులు! నే నీనాటకము నెల్లని చూడవలెనని మొదలుపెట్టించినందుకు మాంట దక్కించండి. అంతేకాని, మీలోమీరు కుమ్ములాడకండి. వైదీక మేమిటి? నియోగ మేమిటి? బ్రహ్మసమాజ మేమిటి? ఆర్యసమాజ మేమిటి? కిరస్తాన మేమిటి? మఱియొక టేమిటి? అంతా వకటే. అందఱమును భగవంతుని బిడ్డలమే ?

సూత్ర—అయ్యా! సభాపతిగారూ! ఆడియన్సు తమ్మునే కింగుమగా భావించినట్లున్నారు. వణుస్మారు అంటున్నారు. ఇదిగాక, యితరులు రంగస్థలంలోకి వచ్చుట మాకు తప్పు.

సభా—ఓహో! ఈసంగతి మాకు తెలియదు.

తద—(నిష్క్రమించును.)

సూత్ర—ఆర్యులారా! మా కీదినమున నీవ్రాళ్ళ కడుపునిండినయన్నము దొరకనందున నాకు నిద్రవచ్చినందుచే పరున్నందుకు మీరు మఱివకలాగు అనుకోవద్దు.

[అంతసభలోనుండి యొకపురుషుఁడు ప్రవేశించును.]

పురు—ఆట్టేచూడఁగా, మీరు పల్లెనాటకుల లాగున్నారే ?

సూత్ర—యజమానినే నేను రంగంలోనికి రానియ్యలేదు కదా ? మళ్ళా నీవొచ్చేవు? సీ నెవరఁయ్యా ! అవతలికిపో !

పురు—(పండ్లుపటపటగొరుకుచు) నే నెవరినో నీకు చెప్పాలేమి ? ఇదిగో చెప్తా (గొంతుకు పిసుకఁబోవును)

సూత్ర—(తనలో) ఇతఁ డెవరో దుండగుఁడు లాగున్నాఁడే! ఈపారుగూళ్ళో మనాటలు సాగవు. ఇతనిచేతిలో నాకు చావు తటస్థించేలాగున్నది. (వణకుచు ప్రకాశము) చంపకు బాబూ ! చంపకు! మీచిత్తం. మీ కీస్టేజిలో ఈజీచైరు వేయిస్తాను.

కూర్చుండండి. మీచిత్తము కూ రెల్లా చెప్పితే అల్లా వింటాను.

(తెరలో)

నీకుతగ్గ ప్రాయశ్చిత్తం జరిగిందా! మేముగనుక నీవు పిలిస్తేకాని రావద్దంటే మానేము. అతడి నాపలేకపోయినావు సరికదా! పైగా నాటకం నట్టేట్లోకలిపి ఆయన చెప్పినట్టు వినడ మేమిటి? మా బాగా జరిగిందిలే.

సూత్ర—(వినినియట్లునటించి) శమచిత్తం నన్ను గొట్టకండి. మీకా ళ్లకు మొక్కుతాను. (కౌఁగిలించుకోఁబోవును.)

పురు—(అవతలకుగోచి) మొక్కుతానని మీఁదఁ బడతావేమి? నీకు తన్నులు తగలాలా?

సూత్ర—(వణకుచు) క్షమించండి! బాబూ! మానటి అనుకున్నాను.

[నటి పటాక్షేపమున ప్రవేశించును.]

నటి—నీవు పిలవనిదే రావడానికి నాకేమైనా నీలాగే బుద్ధి లేదను కున్నావా ?

సూత్ర—(కనులెఱ్ఱఁజేసి) బానిసతొత్తా! అట్లాగయితే యిప్పుడేలా వచ్చేవు ?

పురు—(దవడలుదగ్గరగానొక్కి) ఓరి పండితమ్మన్యుఁడా! నీనోటమ్మట వచ్చినమాటనుబట్టి ప్రవేశించవచ్చును. అదికూడా సూచన లోనే చేరును.

సూత్ర—అలాగునా? చిత్తము. యింతాకా యిదిన్నీ మానటుఁడు న్నూ వాళ్ళంతటవాళ్ళే వచ్చేరులెండి.

పురు—నే నిక్కడి కెందుకు వచ్చినానో యెఱుఁగుదువా? దీనికికూ డా సూచన చెప్పవలెనంటావా? మీ వైఖరిచూస్తే మీ రె ప్పుడున్నూ నాటకమర్యాద యెఱిఁగినట్లు కనుపడడంలేదు.

సరికదా ! మీరు చదివిన నాందిలోకూడ, నాశీర్వచనాదిక
ము కనుపడలేదు. పైగా మీయల్లరి చూస్తే నాకు వళ్లు మం
డింది. పైపెచ్చు నీవు చెప్పడానికి మొదలు పెట్టిన ప్రస్తావన
తో పూర్తిగా మీరేకాక మీకు నాటకం చేసియిచ్చిన ఆధరు
కూడా తెలివిహీనుఁడని ధ్రువపడ్డది. నాంద్యంతమున సూత్ర
ధారుఁడు నిద్రబోవుట యెందుకు ?

సూత్ర—మాకీ నాటకం చేసియిచ్చిన గ్రంథకర్త బ్రాకెట్టులో అట్లు
వ్రాసి యిచ్చినాఁడు. అందుకూ నన్నేమంటారు ?

పురు—మీ కాగ్రంథకర్తక్కడఁ దొరకినాఁడు? అందుకేనా! నాం
దికూడా తన స్వంతముది కాకుండా విజయవిలాసంలో పద్యం
వ్రాసినాఁడు.

సూత్ర—ఏమండీ ! అలాగంటారు. వారు చాలా గొప్పవారండీ !
తమ రాలా మనవిచేస్తే నేనేమి తెలవియ్యను ?

పురు—నీ తెలివంతకన్నా బాగుంది. వారిగొప్ప గొప్పైలు దోలిరి
కాని, సభాపతి మంచివాఁడు గనుక సరిపోయినది. లేకపోతే
ఆధరుకూ నీకూ కూడా తగినమర్యాద కావలసినదే.

సూత్ర—మీరెన్నన్నా వారు గొప్పవారేనని నేననుకొంటాను.

పురు—అనుకో! నీ తెల్వికి సరిపోయినవాఁడు గనుక నీవు మెచ్చడం
బాగానేవుంది. నేనున్నూ వప్పుకుంటాను. వారు పొడుగుగానే
వుంటారని నేను అనుకుంటాను. కవిత్వంమాత్రం వేఁదుటుక
విత్వం గాక తప్పదు. అందుకు నీవు మొదలుపెట్టిన ప్రస్తావన
యే సాక్ష్యము.

సూత్ర—వెదు రేమిటి? కవిత్వం వెదు రెప్పుడున్నూ కాదు.

పురు—వెదురు కాదు; వేఁదుటు.

సూత్ర—అల్లా చెప్పండి వేదమందురూ !

పురు—ఇంత తెలివైనవాఁడవు నీవు సూత్రధారుఁడవా? సూత్రధారునికి మంచి చతురతయు పాండిత్యమున్నూ వుండా లన్నసంగతి విన్నావా? లేదా? వేఁదుఱు శబ్దానికి వేద మర్థము చెప్పేవాఁడవు సూత్రధారుఁడ వైతే యిఁక నాటకం బాగుండడాని కభ్యంతర మేమిటి? "సీకంటం పీకంటమే చాపకంటం చాపకంటమే" అన్నతఁడు నీ కేమికావలెను?

సూత్ర—నాంది నాక్షేపించితిరి కదా? ఆనాందిలో లేకేమిటి?

పురు—లేటా? లోటా? వాకలేఁబు కనకనా? అంతా లేటే! శుద్ధపల్లెవాని మాట ల్లాగున్నాయి.

సూత్ర—హో! హో! లేటన్నాఁనని యాక్షేపింనుచున్నారూ? ఆమాత్రం పొరపాటు మీకు వస్తుంది.

పురు—నాచే ఆక్షే వాగించక యీపాటికి దిక్కుమాలిన నాటకం కట్టిపెట్టి యెవళ్ళ టిక్కట్లసొమ్ము వాళ్ళకు వాపసుచేసి క్షమాపణ చెప్పి పంపించండి. లేకపోతే బాగా జరగదు. నాందిలో కొంచెమైనా నాటకానికి సంబంధించడం లేదు. "కుర్వీత బుధసోమయోః" అన్నట్లున్నది. ప్రస్తావనలో యిఁక కవిత్వమంతా ఔలోటుగానే వుంటుందని తెలుస్తూనే వున్నది. యిక మీ నాటక మెవఁడున్నూ చూడఁడు. కట్టిపెట్టి సొమ్ము వారవేయండి.

సూత్ర—ప్రస్తావనేనా చిగురుదాకా చెప్ప నిస్తారా?

పురు—అసలే చూచేది లేదంటే మాకు మీ ప్రస్తావ నెందుకు? భోజనానికి వద్దంటే పట్టుచీర కట్టుకొని వస్తానంటా వేమి? ఇది యొక పన్నుగడ పెట్టుకొని లోకాన్ని మోసంచేయడానికి వచ్చినట్లున్నారే?

[తెరలో కలకలము.]

సూత్ర-మీ తల్లికడుపులు కాలా! లోపల కొట్టుకొంటూన్నాట్ట్రా! ఓకీ మీవీరమ్మ తాపాలు తగులబెట్టా. ఇది వినండి. యెవళ్ళ సొమ్ము వాళ్ళ కిమ్మంటూవున్నారు. లేకపోతే తన్నుతారట. మనం చదివినది నాంది కాదట. మన కీనాటక మెక్కడదొరకిందో? చెప్పుదెబ్బలు తినడాని కీవూరు వచ్చాము కాఁబోలును.

పురు—చెప్పులూ లేవు, పైజారులూ లేవు. యెవళ్ళసొమ్ము వాళ్ళ కివ్వండి.

సూత్ర—అయ్యా! మనవి. యీనాటకం మావూళ్ళో ప్రదర్శించినామండీ! అక్కడివారంతా బాగా వున్నదన్నారు? ఆథరు కూడా ఆసభ నలంకరించినారు.

పురు--ఎవఁడాథరు? నాకు కనపడితే చెప్పుదును. విజయవిలాసంలో పద్యము నాంది యేమిటి? అదేనా! ఆశీర్వచన మున్నది కాదామె "యేందవుఁడు గోవులూ మాదవుఁడు గాయఁగా మాదవుఁడు మచ్చావతార మైనాఁడా" ఇదేలాగుందో మీ నాంది ఆలాగుంది. మీవూరు పల్లెయో, పట్టో పాలెమో కాఁబోలును. పట్నవాసాల్లో ఈగాడెదగత్తర గరిటిభాగవతాలు పనికిరావు జల్దీగా టిక్కట్టుసొమ్ము తెండి.

సూత్ర—పట్టనికూడా అనకండి. మీ బందరు పట్టి కాదా యేమిటి?

పురు—ఈబందరుపట్టి మజా నీకు చూపేదా యేమి? సిగ్గులేక యింకా జవాబు చెప్తతావేమి? ఏపల్లెనాటకముతో మొదలు పెట్టినా విడి మీపట్టివంటి పట్టే అనుకున్నావా? యేమిటి? సొమ్ము ఖుచ్చివేయి.

సూత్ర—(తెరవంకదిరిగి) ఏమిరోయి! మీరంతా బాగానే వున్నారు "సొమ్ము తెస్తావా! ఛస్తావా" అని యీయన నన్ను ధిక్కరిస్తూ వున్నాఁడు. మీ రెవళ్లేనా రండి.

[తెరలో]

మేము నాటకంలోకి తగినవేషాలు వేసికొని వున్నాము. నాటకరీత్యా నీవు సూచనగాని పిలవడంగాని చేస్తేనే వస్తాముకాని లేకపోతే వచ్చేవాళ్ళము కాము.

పురు—వాళ్లెందుకు రావాలి ? నీవు లోపలికివెళ్ళి సొమ్ము పట్టుకొని రారాదా ?

సూత్ర—చిత్తము. (కొంతదవుకువెళ్ళి,మరలి) అయ్యా ! మనవి. అంకమధ్యమందు రంగం శూన్యం కాఁగూడదని మీవంటివారే చెపుతారే నేను వెడితే యేలాగు ?

పురు—(నవ్వి) నాటకమే మానుకున్నప్పుడీకట్టుబాటెందుకు? ఇది అంక మేలాగైనది ? తిన్నగా తెలియకపోయినను మూర్ఖులకేవో కొన్ని సంప్రదాయపుమాటలు, తెలుస్తాయి. అవి అనుపయుక్తసమయంలో జ్ఞాపకానికి వస్తాయి. గాలీ వానా వస్తే కథే మానుతుందని యెఱుఁగవు ?

[టిక్కట్టుకలక్టరు ప్రవేశించును.]

టిక్క—(రూపాయీలసంచిచేతికిచ్చి) నే చెప్పలేదూ ? మన మీ బందరుకు రావద్దని. యేచేతఁగాని వాళ్ళున్న చోటనో అయితే యీనాటకమే నెత్తిమీఁద పెట్టుకొందురు. మనకున్నూ గౌరవము కలుగును. ఆథరుకున్నూ మాట దక్కును. "పాలిజేంద్రసభామధ్యే సాతానిః పండితాయతే" దీని కేమి ? రేపీవూరునుంచి బుజ్జగొట్టుకుంటూ పోవాలికదా ? రైలుఖర్చెక్కడనుండి తెస్తావు ? సూత్రధారుఁడవుకాదు ! అంత భారం నీదే ?

సూత్ర—అట్టే పేలకు. మేనేజరు నడుగు. నన్నడుగుతావేమి? ఈ యన యెవరో మహావిచిత్రమైన మనిషి. నిన్నుఁ గూడా తన్ను వచ్చును. ఈవూరుసంగతి ముందస్తిగా మనకేం తెలుసును? మన మేమైనా దేవుళ్లమా యేమిటి? ఎక్కడా ప్లేజిమీఁదనే ఆడియన్సు రావడమే యెఱుఁగము. పైపెచ్చు తన్నడానికిసిద్ధ పడడంకూడా మొదలుపెట్టినారు.

పురు—ఇంకా యీవూరిమజా నీకు తెలియదు. ఇక్కడి పిల్లలను నీవు గుఱుతించలేదు. ప్రతికుఱ్ఱవానికిన్నీ నాటక మంటే యేమిటో అది యేలాగు ప్రదర్శించవలెనో బాగా తెలుసును. మోసపు గ్రంథకర్తలుగాని, నాటకులుగాని యిక్కడ పనికి రారు. ఎప్పుడున్నూ ఈవూళ్లోకూడా ఇట్టిపని జరగలేదు. కాని, వెనుక యేకంపెనీకోగాని జరిగినది. నేఁడు మీకు జరిగినది. నేను గనుక మీకు మెల్లిగా చెప్పుతూ వున్నాను. నిజముగా ఇదే మఱివక కుఱ్ఱవాఁడైతే యీమాత్రం వోపిక పెట్టఁడు. సొమ్ము యిచ్చివేయండి. వృథాగా నాలస్యమెందుకు? నిద్ర చెడుతుంది.

సూత్ర—(లెక్కపెట్టి యిచ్చును.)

పురు—(లెక్కచూచి) ఇంకను పదిహేనురూపాయీల నాల్గుఅణాలు రావలెను.

సూత్ర—ఏమోయి! తక్కిన లెక్క యేమిచేసినావు?

టిక్క—కాపిపాలకు, సోడాబుడ్లకు, టమటమాకు షోరాలకు అయిపోయినాయి

సూత్ర—వీట్లకు పదిహేనురూపాయిలదాకా యెందుకు?

టిక్క—నోటీసుల ప్రింటింగుకు కొంత యిచ్చాను.

పురు—వీట్ల కన్నిటికీ రేపు యిస్తారుగాని యింకా నాటకంకాండే యివ్వరు. యేవల్లెవానికో చెప్పినట్లు చెప్పుచున్నావే? అగుం గాక- స్వంతములోనుంచి యివ్వండి.

సూత్ర—మాకు స్వాంతంలో డబ్బులేదు. పోనీ డ్రస్సైనా అమ్మదా మంటే అదిన్నీ మంచిదిలేదు; అందులోనున్నా వకడికుంటే రెండవవాండికి లేదు. అనుగ్రహించక తప్పదు. మాకయిన ఖర్చులు తమకు రెయుంగనివి కావు కదాండి.

పురు—ఆదంతా నైజాంతాహే. టిక్కట్లసొమ్మంతా యిక్కడకక్కండి. లేకపోతే హార్మోనియమ్ పుచ్చుకొంటాము.

సూత్ర—తమచిత్తం. మీగ్రామానికి వచ్చినాముగదాండి. మమ్మల్ని మీరే వొడ్డెక్కించాలి. "అన్యధాశరణంనాస్తి త్వమేవ శరణం మమ"

[మఱియొకపురుషుఁడు ప్రవేశించును.]

మఱి—ఏమయ్యా! నాటకులు. మారెంటువాట యేమిచెప్తారు?

సూత్ర—అయ్యా! మేమేమైనా నాటకమూడి సంపాదించిన దున్నది గనుకనాండి, మీకు అద్దెయివ్వడానికి.

మఱి—ఏం పెద్దమనిషి వయ్యా! అట్లా అంటావు; మీకీవాళ నాలుగువందలరూపాయిలు వస్తే మాకేమైనా యెక్కువ యిస్తారా? యెట్లాగునున్నా మేము పదిహేనురూపాయిల వాళ్ళమే. గుఱ్ఱంగుడ్డిదైనా గుగ్గిళ్ళు తప్పవుకదా?

సూత్ర—చిత్తం- రేపు మనవిచేస్తాను.

మఱి—రేపేమిటి? "పశ్చాచ్ఛిద్రో నాస్తిపర్యాయః" ఇంక నీవ్రాళ్ళో మీనాటకాని కెవడువస్తాడు? కాబట్టి రేపు మీ కాసీమూంతం తప్పదు. మూలఅద్దె యిప్పుడే యివ్వండి.

పురు—(ఏక్కసక్కెముగా) సూత్రధారుఁడుగారూ! మీరా కేనాటక మాడఁదలఁచుకొన్నారో మీనాంది వల్లగాని ప్రస్తావన వల్ల గాని తేలలేదు గాని యిప్పుడు హరిశ్చంద్రనాటకంగా పరిణమించింది. ఈయన నక్షత్రకుఁడులా తగులుకొన్నాఁడు.

మఠి—మీరుమాత్రం వదలిపెట్టినారా యేమిటి? విశ్వామిత్రుఁడులా మీరు బాధిస్తూవున్నారు. ఎవరైనా సొమ్ము వదలిపెట్టరు.

టిక్కు— మొఱ్ఱో! యీఅవలోఁడునాటకం మొట్టమొదటనే మొదలు పెట్టవద్దంటే వినకపోయినందుకు నీ కీప్రాయశ్చిత్తం కావలసిందే;

మఠి—అయితే యీనాటకం పేరేమిటి?

పురు—నోటీసు లంటించినారు. చూడలేదు? 'బొడ్డుబాలతాతీయము'

మఠి—బాలతాత దీనిలో నాయకుఁడా యేమి?

సూత్రి—కాదు; నాయకునితండ్రి.

పురు—నాయకునిపే రుండవలె లేదా, నాయిక పేరుండవలె. ఇంకను మఱికొన్ని గుఱుతులంబట్టి యుండవలెను గాని యీముసలాడి పేరెందుకు?

సూత్రి—అదంతా గ్రంథకర్త నడగండి. మాకు తెలియదు.

మఠి—గ్రంథకర్తజోలి మా కెందుకు? కాని, మా కొంటుమాట చెప్పండి.

పురు—గ్రంథకర్త సజీవుఁడేనా?

సూత్ర—ఆ! సజీవుఁడే. అఱువై యేళ్లుంటాయి?

పురు—ఇరవై యేళ్లేనా? అలాగైతే చిన్నవాఁడే?

సూత్ర—ఇరవై కాదు, అఱువై.

పురు—అయితే చాలాపెద్దలు. ఆయనతో నేనిట్లు మనవిచేసినానని చెప్పుం. నాంది అంటే యేమిటో; ప్రస్తావన అంటే యేమిటో

తెలియనివాళ్ళు నాటకం వ్రాయకూడదనిన్నీ ఒకవేళ గొప్ప కోసం వ్రాసినమా మీవంటి అనూయకులకు ఇచ్చి చదివించ కూడదనిన్నీ పైగా యీలాటి పట్నవాసాల్లోకి ప్రదర్శించే నిమిత్తం వెళ్లేటప్పుడు బొత్తిగా వప్పకోకూడదనిన్నీ తప్పక చెప్పండి. వారు పెద్దలయితే అయినారుకాని యీదినం వారి కష్టమంటే యీమర్యాద అంతా వారికే జరగవలసింది. వారి తరపున మీకు జరిగింది. దీనిని వారు జమకట్టుకోవలసి యుం దును. ఆయనకు నాటకమే వ్రాయవలెననియుంటే యీవూ రు వస్తే యేకుఱ్ఱవాడైనా దానివిధానమును చెప్పి పంపుతా డు. తర్వాత వ్రాస్తే కొంతగాకపోతే కొంతైనా బాగుండ వచ్చును. ఈ సంగతులన్నీ ఆయనతో చెపుతారుకాదూ ?

సూత్ర—చిత్తం. చిత్తం. మేమిక్కడ చిక్కుకుపోకుండా యింటికి వెడితే తప్పకుండా మీరు చెప్పినారని వారితో మనవిచేస్తా. అయ్యా ! తమపేరెవరండీ ?

పుర—ఎవరైతే నేమిలే. పేరుతో పనేమున్నది ? యీబందరు చెప్పి నదని చెప్పండుమూ; అయితే మీలో నెవళ్లైనా తెలివైనవా ళ్లున్నారూ ?

సూత్ర—ఉన్నారు. ఏమిలాభము ? మొదటనే యీ దిక్కుమాలిన నాటకం మొదలుపెట్టడంచేత వాళ్ళతెలివంతా "సానకింద వన్నెగా" నిష్ప్రయోజనం అయిపోయిందండి. (కన్నీరుపెట్టి కొనును.)

మణి—(జాలి సూచించి) విచారింపకయ్యా ! అలాగయితే యేదేనా మంచినాటకం రేపు ప్రదర్శించండి. దానిపైని మీకు త్రోవ ఖర్చు వగైరా కలిసిరావచ్చును.

సూత్ర—(కన్నీరు తుడుచుకుని) తాము బహుమంచివారు. యీ యాడియన్సుతో మనవి చేయవలెను.

మణి—విచారించకండి! ఈయన చెపితే అందఱున్నూ విశ్వసించుతారు. పాపము ద్రవ్యం కోసం కాదుగాని అవమానంకోసము మీకు కంటమ్మట నీళ్ళు వొచ్చాయి.

పురు—వీళ్ళలోపమే యైనచో వీళ్ళను మనమవమానపఱచుట యుక్తముకాని నాటకమందున్నలోపానికి వీళ్ళేమి చేయుదురు? వీళ్ళలో విదూషకుఁ డొకఁడు మంచిసమర్థుఁ డున్నాఁడని విన్నాము. ఇంకా ఎవళ్ళైనా ఒకరిద్దఱు ఉండకుండా యింత దూరం రారు. ఇట్లప్పుఁగాక. (ప్రకాశముగా) ఎందుకు విచారిస్తావయ్యా? విచారించకు. నేను నిన్నన్నమాటలన్ని నాటకానికింద జమకట్టవలసినదిగాని నీకుసంబంధించవు. మీలో మీకు పద్దగందఱగోళమంతా ఆనాటకములో ఉంది కాఁబోలును. విచారించకు. ఆడియన్సుతో నేను చెప్తాను. (సభవంకఁ దిరిగి) అయ్యా! ఈలోపమంతా నాటకమందున్నట్టున్నూ వీరియందు లేనట్టున్నూ తోస్తూవున్నది. గనుక తమరందఱున్ను అనుగ్రహించి రేపేదేనా మఱియొక మంచినాటకము వీరిచేత ప్రదర్శింపించినూట వీరిని ఋణవిముక్తులను చేయ వేఁడెదను. ఈవాళ మనము టిక్కెట్లసొమ్ము పుచ్చుకుంటామన్నను వీరివద్ద పూర్తిగా లేదు. (వినుటనటించి) ఇందుకు సభ్యు లంగీకరించినారు. మీయదృష్టమును నాయదృష్టమునుఁగూడ మంచిది. ఈసొమ్ము మీయొద్దనే యుంచికొనుఁడు (ఇచ్చును.)

విదూ—(ప్రవేశించి) హీ, హీ, హీ, అయ్యా! మీరు నేడు మాసూత్రధారుని తెల్విితక్కువచే ప్రదర్శింపఁబూనిన బొడ్డుశాలతాతీయమునకు దయచేసి వృథాగాఁ దాము నిద్దుర చెడఁగొట్టు

కున్నారు. ఇదిగాక సామ్ముగూడా ఒక్కపరిగా నంతరించియు
వమ్మయిపోయింది. కావున,

సీ. కాంతిచేతనె గాక కాయమ్ముచేఁ గూడ
నెనుఁబోతుగున్న చె న్నీసడించుఁ
గామునుచేతనె కాక గానములచేఁ గూడ
మాలమాదిగల సామ్యమువహించు
దేవభక్తిని కాక ద్విజభక్తిచేఁ గూడఁ
దురకసాయెబయ్య నెఱుఁగఁ జేయుఁ
గులముచేతనె కాక గళమాధురినిఁగూడఁ
గాకకులంబు బెగ్గడిలఁ దరుము

గీ. వాఁడు వీఁడని మీకు నావాలకంబె
చెప్పఁ గావున నే వేఱె చెప్పికొనను
మమ్ము దరిసించుకతన మీసామ్ము ముట్టె
నట్లు సంతస మంది మీ రరుగుఁ డిఁక.

పుర—నణాస్తె మోరు! వణాస్మారు! (కరతాళధ్వని)
ఎల్ల—[నిష్క్రమించుచుండఁగా)
టికెట్టు—(సవినయముగా) అయ్యా! ఈభరతవాక్యము విని మఱి
యుఁ జనుఁడు.

చ. కలుగునుగాక సంతతు లఖండుల కన్నము గల్గువారికిన్
జెలఁగునుగాక సత్కవిత శ్రీకరమై జగమందు నెల్లెడన్
దొలఁగునుగాక మోసమును ద్రోహమును న్నశియించి పూర్తిగా
మెలఁగునుగాక యోగ్యుఁడు సమీరకుమారునిభంగి ధీరుఁడై.

[అందఱును నిష్క్రమింతురు.]

## ఆంధ్రకవులు.

ఉ. సారశరార్థసంపదలు సారససారసరఃప్రసారము
గ్గారసవత్తరంబుగ నిగారము గారము దోఁప సాహితీ
భారతిభార మంతయును భారతము న్దిరవొంద నాంధ్రభా
షారమణీరమం గొలుచుసజ్జను నన్నయభట్టు నెన్నెదన్. ౧

ఉ. తిక్కనసోమయాజికి నతిం బొనరింతుఁ గవిత్వలక్ష్మికిన్
దిక్కగువాఁడు, నన్నయ గతించినమీఁద నతండు చేయునా
తక్కినభారతంబును సుధామధురంబుగఁ దెల్గుఁ జేసి పెం
పెక్కినగొప్పవానికిఁ గవీశ్వరకామితరాజధానికిన్. ౨

ఉ. భాంతక్కృత్కృష్టశ్వరులపక్కని దాఁటఁగ రాము వారికిన్
మూఁటిటిరూపనంగ నసమానతరప్రతిభాసమృద్ధి పెం
పార నరణ్యపర్వమును సాంతము చేసినమేటికిన్ సునీ
హీంనునకుం బ్రబంధపరమేశున కంజలి సంఘటించెదన్. 3

ఉ భాగవతంబు సర్వరసబంధురముగ్ దెలిఁగించినాఁడు స
ర్వాగమసారవేది జతరార్థముగాఁ జెంచుసాఁచకే మహా
భాగుఁ డితం డటంచు నరపాలురు మెచ్చఁగ జీవితంబు సాం
ఘాగతి నోమినాఁ డితడు లాదురె? పోతనవంటిసత్కవుల్. ౪

సీ. పసితనంబుననుండి బహురసప్రథితప్ర
బంధనిర్మితికిఁ బాల్పడినవాఁడు
నన్నయాదికవీంద్రశైలి కెనవచ్చు
పాండితీగరిమ చేపట్టినాఁడు
దేశంబు లన్నియుఁ దిరిగి తత్రత్యభూ
పతులసన్మానంబుఁ బడసినాఁడు

శయ్యాచమత్కారసంప్రదాయంబున
నతనుప్రతిష్ఠచే నలరినాఁడు

గీ. భాసురానూనకవితాప్రసారసార
తోషితాశేషభూపతిస్తూయమానుఁ
డతఁడు పొగడొందు శేముషీవితతకీర్తి
ధట్టచరితుండు శ్రీనాథభట్టసుకవి. ౫

ఉ. కాతరభావ మించుకయుఁ గాని యెఱుంగని పాండితీబల
స్ఫీతకథావిధానసరసీకృతచారుతరప్రబంధని
ర్మాతలు సాహితీముదితమానవపాలకులై చెలంగు నా
కేతన మారనాదికవికేతనులన్ గణుతింతు నిచ్చలున్. ౬

ఉ. సంగతచాతురీమహిమసారఘుమంఘుమితప్రసిద్ధస
ర్వాంగమనోహరాయు కవితారభటీపరిపూర్ణ సర్వది
క్ప్రాంగణు హాస్యకృత్కవి ననర్గళచారుపదప్రయోగశా
లిం గణుతించువాఁడఁ గవిలింగని లోఁగని భక్తి పెంపునన్. ౭

సీ. ఆంధ్రకవిత్వమ్మునందుఁ బితామహ
ఖ్యాతిఁ గైకొన్న పెద్దన్న యొకఁడు
అంగనామధురాధరాకారసుకవితా
స్వాదిమ గలుగుధూర్జటి యొకండు
ముద్దుమాటలచేత మోదమ్ము గలిగించు
నసమానసుకవి తిమ్మన్న యొకఁడు
తగుచతుర్విధకవిత్వంబులందును చాల
కీర్తి గాంచినభట్టుమూర్తి యొకఁడు

గీ. మొదలుగాఁ గలసుకవి సమూహమునకుఁ
దనసుధాసమకవితచేతనప్రమోద

మాచరించినకృష్ణరాయరావనీంద్రు
నపరదేవేంద్రు నెంతు ననారతంబు. ౮

ఉ. నాటకశైలి యాంధ్రకవనంబునకుం దలఁ జూపఁజేయుచున్
మోటుతనంబు మాపనివి నూతనవర్ణన లుద్ధతిం బునః
పేటిక నిండుతుష్టి, కవిపేరులకుం గలిగించినట్టి యా
మేటికవీశ్వరుండు కవిమిత్రుఁడు సూరనకుం నమస్కృతుల్. ౯

తే. గీ. మఱియు నాంధ్రప్రబంధముల్ మహితకీర్తు
లొనరఁ గావించి యాంధ్రలోకోపకార
మాచరించినసుకవుల కాచరింతు
వివిధనామములకు నుతుల్ వేనవేలు. ౧౦

తే. గీ. పెక్కు లాంధ్రప్రబంధముల్ కుక్కుటేశ్వ
రునకు నంకిత మిచ్చి పేరుం బ్రతిష్ఠఁ
గొనినసత్కవిచంద్రుండు కూచిమంచి
తిమ్మకవి కిప్పు డే వందన మ్మొనర్తు. ౧౧

తే. గీ. ఆశుధారాకవిత్వవిఖ్యాతిచేత
శతవధానవిధానప్రశస్తిచేత
మధురతరసుప్రబంధనిర్మాణమున య
శంబుఁ గాంచిన వేంకటరాచార్యుఁ దలఁతు. ౧౨

చ. సరసతరప్రబంధము లసంఖ్యముగా రచియించి భూమిపైఁ
బరపి శతావధానము లపారముగా రచియించి సర్వభా
స్వర మగుకీర్తి నల్దెసల వ్యాప్తము జేయుచు సర్వదేశముల్
తిరిగిన వేంకటేశకవిదేశికు సన్నుతిఁ జేతు నిచ్చలున్. ౧౩

(బందరు హిందూ హైస్కూలులో మఱ్ఱిచెట్టు కొట్టినప్పుడు చెప్పినవి)

సీ. నీపైని నివసించునీపుల్గు లెల్ల నిం
కేచెట్టు చేరునో? యెఱుఁగరాదు
నీయాకు లాసించునీబీద లెల్ల ని
య్యెడ నెంత గుందిరో? యెఱుఁగరాదు
నీనీడ నాటాడునీబాలు రెల్ల నిం
కేపాట్లు పడుదురో? యెఱుఁగరాదు
నీపాల కేతెంచు నీపౌరులకు నెల్ల నిం
కేది గతియొ? మా కెఱుఁగరాదు

తే. గీ. అన్నిమాటల కేమి? నీయందు దోకింత
యేని యపరాధమును లేక యిట్టు లైతి
వక్కటా? యేండ్లు నూఱైన యట్టినీకు
వగవ నేటికి? దుఃఖ మాపంగ లేము. ౧

సీ. ఊరెల్ల దిబ్బైనయుప్పెనగాలి కొ
క్కింతేని చలియింప కిట్టులుంటి
వాపైని వర్షమావంతేని లేకున్న
కఱవు లెన్నెన్నియో కడపియుంటి
వవసరమ్మునకు నీదౌకొమ్మ లెందఱెం
దఱు గొట్టినను దానఁ దలఁకవైతి
వింతేల? మొన్నఁ జెట్లెన్నియో పడిన యా
గాలి కేనియును దూఁగాడవైతి

తే. గీ. వక్కటా! పాపపువిధాత యనపరాధి
వైననీకాలమున నిట్టు లడఁగు మంచు

గ్రాయు నట్లేలపోయెదు వాడు మాకు
వచ్చుటకు నుంటి విన్నాళ్ళ వటకుజంబ. ౨

ఉ. "ఆటకుపీ" లటంచు నిను నక్కట! కొట్టిరి నెట్టపంటగా
నేటికి నష్టమైతి వది యించుక లేదు పరేగదా? భవ
త్పాటవకారణమ్ముసన శౌలుగు సేద యొకింత లేక యీ
యాటల నెల్ల నాడి రిపు జొగతి మా కెది? వృక్షరాజమా. 3

తే. గీ. "అకట! యెదు రైననాని నెన్నమ్మ గొట్టె"
నన్నసామెత నిజ మయ్యె, నహహ! నీయ
వస్థ చూచిన నీవు దూరస్థలమున
నున్నజీవింతు వేమొకో? కొన్నినాళ్ళు. ౪

శా. హిందూస్కూలున నున్ననీయెడల మాకేకాదు మాదేశిక
స్కాందుల్ మున్నగువారికేనిఁ గనలే కన్పట్ట దావంత, యీ
నిందల్ బై కెఱు పోవనిత్తు? మది మాఁనెత్తిఁ బడఁ వేయు మే
మెందుఁ గ్రీడల గెల్చు టేసుమి? నినుఁ హింసించె వృక్షేశ్వరా.

---

(తుమ్మచెట్టు)

మ. అమలంబై రసవత్తమంబగు ఫలంబా లేదు, నీచెట్టుచెం
త మనుష్యుల్ నిలువంగనోపరు భవత్పర్ణంబు లింతింతలే
సి మెయిఁ గంటకరాశి నిన్నెటు సృజించెఁ బ్రహ్మ నీ వెందుకో
సము జీవించుట తుమ్మచెట్ట! నిను వృక్షంబంటయే తప్పిలఁ.

---

## * అశ్వత్థస్తోత్రము.

శా. శ్రీలోలుండు గుణాకరుండు త్రిజగత్క్షేమానుకూలుండు స
చ్ఛీలప్రాపకుఁ డార్తరక్షణకళాసింధుండు నశ్వత్థను
ధ్యాలంబాత్ముఁడు విష్ణుదేవుఁడు సమస్తైశ్వర్యసంధాతయై
పాలించుఁ జెలికానిసూర్యవిభునిన్ భైషజ్యచింతామణిన్. ౧

క. శ్రీయును గోరినకోర్కులు
నాయాసము లేక లోక మందఁగ నేఁడే
నీయొజుంచి సురాత్మక
మైయొసఁగు పదార్థ మొకటి యానతి యీవే. ౨

వ. అంచు వినయావనతుండై ప్రార్థించు నారదునకు విరించి యిట్లనియె.

తే. గీ. నాయనా! దేవమూని! నిశ్శ్రేయసార్థ
సాధకను సర్వకిల్బిష బాధకమ్ము
తలఁచిచూడఁగ నశ్వత్థతరువు తప్ప
దిక్షిణమ్మున నగుమేలు తిరమె పాగ్రహ. ౪

సీ. అరయఁగా నశ్వత్థతరువు దక్షిణమున
రూపింపఁబడియుండు రుద్రమూర్తి
నారాయణుండు పాల్పారుఁ బశ్చిమమున
నొప్పారుచుండు నే నుత్తరమునఁ

---

* దీనిని రచింపు మని కోరినవారు శ్రీ శ్రీ చెలికాని సూర్యారావుగారు. వీరి తండ్రిగారు వేంకటరాయనింగారు. ఈ సూర్యారావుగారినివాసము చిత్రాడ. ప్రస్తుతము వీరు లక్ష్మీనరసాపురమున సజీవులై యున్నారు. వీరు సుప్రసిద్ధులే కాన విస్తరింపవలసిన యావశ్యకత లేదు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.

బూర్వదిక్కునయందు గీర్వాణపతియును
సఖలగీర్వాణులు నలరుచుంద్రు
స్కంధమ్ములం దుపస్కంధములందును
గోవులు విప్రులు గోరలుచుంద్రు

తే. గీ. పత్రములయందు ఋషులు పరగుచుంద్రు
దీనిమూలంబు వేదముల్ దీనిపాలఁ
గల్గుచుండెడిజన్మముల్ నాల్గుదెసల
నదులు నదములు సరసులు నుదధు లుండు. ౫

తే. గీ. పాలఁ బొల్పారి మఱి ఫలభరము లేక
చల్లనీడల నిడువనస్పతివి నీవు
అమ్మ! నినుఁ గొల్చి మానవుఁ డఖిలసుఖము
లైహికాముష్మికంబుల నందఁగలఁడు. ౬

తే. గీ. కులమిలఁ జలించు కెంపారుదళము లొదవి
ఆదినారాయణస్వామి కాశ్రయ మయి
బోధిసత్త్వోజ్జ్వలం బయి పొలుచు నీకు
వందనమ్ము లొనర్తు నశ్వత్థదేవ! ౭

తే. గీ. తక్కుయోగ్యత లట్లుండఁ దరువులందు
నీ వరిష్టనాశకమవై నెగడి ధన్య
తమతఁ గంటివి విష్ణువు తవిలినిను
పట్టుకు వసించుకతన నశ్వత్థదేవ! ౮

తే. గీ. వ్యాధులీగడుపాలు నీచలనఁ గలవు
శ్రీయు నిన్నాశ్రయించి వర్తించుచుండు
నింత నిజ మనియెఱుంగుము రెల్లవారు
శ్రీల సమకూర్చి మమ్ము రక్షింపుమమ్మ! ౯

క. ఏకాదశరుద్రులు నా
కాకప్రభు వైన విష్ణు వష్టవసుమయ
శ్రీ కిరవు పావకుంచున్
నీకళ నీ కంజలి యవనీరుహరాజా ! ౧౦

తే. గీ. అగ్నిగర్భ ! శమీగర్భ ! యజ్ఞగర్భ !
కనకగర్భ ! ధరాస్థలీగర్భ ! దేవ
గర్భ ! యోయిప్రజాపతీ ! కడఁగి నీకు
వందన మొనర్తుఁ బ్రోవు మశ్వత్థదేవ ! ౧౧

తే. గీ. ఆయువు బలమ్ము వర్చస్సు యశము మఱియుఁ
బసువసుప్రజావృద్ధియు బ్రహ్మతేజ
మాధిరాహిత్యమును బ్రజ్ఞ మేధయు నిడి
చక్కఁగాపాడు మము వనస్పతివరేణ్యా ! ౧౨

తే. గీ. సతను వరుణుండు నినుఁ జక్కఁ సాఁకుఁగాక
యెల్లపుడు వృష్టి నిన్నాశ్రయించుఁగాక
ఎసఁగుఁగాక నిచుట్టును దృణసమృద్ధి
అన్నిటను నీకు సుఖము చెన్నారుఁగాక. ౧౩

క. చెడుకలలున్ జెడుచింతలుఁ
జెడుశకునమ్ములును శత్రుచేష్టితములు మా
యెడ నడుగిడకుండఁగ నీ
వడఁగింపుము సర్వకాల మశ్వత్థంబా ! ౧౪

క. దుస్స్వప్నహారణమునకుఁ
సుస్స్వప్నప్రదమునకు వసుప్రదమునకున్
నిస్స్వత్వహరమునకు నతి
ప్రాస్వీతదురితంబ ! నీకు నశ్వత్థంబా ! ౧౫

క. నీమూల మబ్జగర్భుఁడు
నీమధ్యము విష్ణుమూర్తి నీయగ్రంబో
సోమార్ధమౌళి వృక్ష
స్వామీ! యశ్వత్థ! నీకు స్వస్త్యయనంబుల్. ౧౩

క. దేనిన్ జూచినమాత్రన
మానును రోగములు సోకుమాత్ర నఘహరం
బౌ నాశ్రయింప నాయు
శ్శ్రీ నెగడించునట్టి నీకుఁ జేతులు మోడ్తున్. ౧౪

తే. గీ. ఓమహాభాగ! యశ్వత్థ! యోమనోహ
రాంగ! సుప్రీతుఁడవు కమ్ము! యాశ్రయింతు
నోజ నాశత్రువులకుఁ బరాజయమ్ము
నాకు దిగ్విజయమ్ము సంతతము నిడుము. ౧౫

క. ఆయుర్దాయము సంతతి
శ్రీయున్ ధనధాన్యసుఖసమృద్ధియు సతమున్
నీయడుగులు గొల్చెడినా
కోయశ్వత్థతరురాజ! యొసఁగఁగదవే. ౧౬

తే. గీ. ఇట్లు వేఁడెడి వారల కిహపరములు
కొదవలేకుండుఁ జుమ్మి నారదమునీంద్ర!
ఋషులు వేదమూల మ్మని యెఱిఁగి రావి
చెట్టును బరాత్పరునిగ నర్చింతు రెలమి. ౧౭

క. గురుఁ జంపి విప్రుఁ గెడపియు
దరిద్రుఁ డయి రోగి యైన పిదప నీస్తవమున్
బరఁగ నొకలక్షజపమున్
జరిపిననరుఁ డందు సుఖము సత్యము మునీ! ౧౮

తే. గీ. ఎట్టిపాపోపహతచిత్తుఁడేని యాత్రవ
తమున కధికారి యన,నిఁక స్థండిలశయ
నుండును హవిష్యమాత్రాశనుండు బ్రహ్మ
చారియును వశియైన విచారమున్న? ౨౨

తే. గీ. ఏకహస్తప్రమాణమ్ము నేని రెండు
చేతులంతయు నేని ధరాతలమ్ము
గోమయమ్మున నలికి ముగ్గు లిడి రావి
"నో"మని యజింత్రు పురుషసూక్తోక్తవిధిని. ౨౩

క. మానమ్మును గొని యశ్వ
త్థానోకహముఁ బ్రదక్షిణాచరణమునన్
మానించి విష్ణునామ
ధ్యానమ్మున నందుఫలము నందఁగవచ్చున్. ౨౪

తే. గీ. పదమునఁ బదాంతరం బేగి పరఁగ హస్త
చేష్టలాఁగి వాక్కున నుతిఁ జేయుచును మ
నమ్ము ధ్యానమ్మునం దిడి నాలుగంగ
ముల నిటు ప్రదక్షిణము సేయవలయు నంద్రు. ౨౫

క. ఎవఁ డశ్వత్థస్థాపన
మవనిఁ గావించు వాని యన్వయము తిరం
బవు ఘనము నాయు వొలయుఁ
దివికిఁ జనువారు తత్పితృప్రవరు లొగిఁ. ౨౬

ఆ. వె. రావిచెట్టునీడ రహిఁ నొక్క విప్రుని
గుడువఁబెట్టెనేని కోటివిప్ర
వరుల కన్న మిడినపరమార్థ మబ్బెడి
నరయు మింత నిక్కమగు మునీంద్ర! ౨౭

తే. గీ. అనఘ! యశ్వత్థతరుమూలమం దొనర్చు
జపము హోమంబు దేవతార్చనము నక్ష
యం బగుఫలమ్ము నిచ్చు నని యజుఁడ నేను
జెప్పుచుంటి నీమాటయుఁ దప్పఁగలదె? ౨౮

క. మును గోడివినగతి రావిని
జనుఁ డాశ్వాసింప నది ప్రసన్నం బై వా
నిని దగ నాశ్వాసించున్
మనమున నిది యెఱుఁగుమయ్య మౌనిప్రవరా! ౨౯

తే. గీ. జన్న మొనరించుఫలంబు నశ్వత్థతరువు
గొట్టి స్వర్గమ్ముఁ జను వృథా కొట్టు నెవఁడు
వానిపితరులు నరకానఁ బడుదు రొక్క
రావిపూజ సమస్తసురలను దనుపు. 30

సమాప్తము.



శారదాప్రెస్, కాకినాడ—1929.